# కేమెల్ జామెట్రీ బాక్స్‌ల 5 ప్రత్యేక విశిష్టతలు.




అత్యంత ప్రజాభిమానాన్ని చూరగొన్న బ్రాండ్ :
ఈ జామెట్రీ బాక్స్‌లు అత్యధికంగా అమ్ముబడుతున్నాయి. భారతదేశమంతటా గత సంవత్సరం 10,00,000 అమ్ముబడ్డాయి.




పోటీలేని నాణ్యత :
వీటిలోని రూలర్, సెట్ స్క్వేర్, ప్రొట్రాక్టర్ స్పటికంలా కన్పించే శ్రేష్ఠమైన ప్లాస్టిక్‌తో తయారుచేయబడ్డాయి. కంపాస్ మరియు డివైడర్ క్రోమ్ ప్లేట్ చేయబడినవి. ఈ విశిష్టతల వల్ల వాటికి నిశితత్వం, మరింతకాలం మన్నిక.

ఎన్నుకునేందుకు వీలుగా మూడు బ్రాండ్‌లు :
స్కాలర్, క్యాడెట్ మరియు క్లాసిక్ — పేరెన్నికగన్న ఈ మూడూ కేమ్లిన్ అందిస్తున్నవి.







అనేక రకాల నాణ్యమైన ఇతర ఉత్పాదనలు :
విస్తృత శ్రేణికి చెందిన ఆర్ట్ మెటీరియల్స్, పెన్సిళ్లు, సాంకేతిక ఉపకరణాలు.

కేమెల్ — నేడు పరిశ్రమలో అత్యంత ప్రాచీనమైన, పేరెన్నికగన్న పేరు
ఇది 25 సంవత్సరాలుగా నాణ్యమైన సేవను సమకూర్చిన సంస్థ.

## కేమెల్

జామెట్రీ బాక్స్‌లు—
పోటీలో విజయంలో ఓ కొత్త మలుపు.



కేమ్లిన్ లిమిటెడ్
ఆర్ట్ మెటీరియల్స్ డివిజన్
బొంబాయి-400 059.




VISION/CL/6/TEL






TRAVEL
INDIA






Fun is

A CHANDAMAMA PUBLICATION

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["జయశీలుడి నిర్ణయం"]కు ఆధారం మనోజ్‌దాస్ రచన. మనిషి అన్నివేళలా సత్యమే మాట్లాడాలని ధర్మశాస్త్రాలు చెబుతున్నాయి. అయితే, సత్యాసత్యాల విలువలు వాటి పర్యవసానాలను బట్టి నిర్ణయించవలసి వుంటుంది. ఈ మహత్తర సత్యాన్ని, "విభూతిమిశ్రుడి మానవత్వం" అన్న కథ చక్కగా వివరిస్తుంది.

## అమరవాణి

ఉదయే సవితా రక్తో, రక్తశ్చాస్తమయే తథా,
సంపత్తౌ చ విపత్తౌ చ, మహతామేకరూపతా.

[ఉదయించేప్పుడూ, అస్తమించేప్పుడూ, సూర్యగోళం ఎర్రగానే వుంటుంది. అదేవిధంగా, సంపదలలోనూ, ఆపదలలోనూ గొప్పవారు ఒకేలాగా ప్రశాంతంగా ప్రవర్తిస్తారు.]

సంపుటి 85 జూలై '89 సంచిక 1

విడి ప్రతి : 3-00 :: సంవత్సర చందా : 36-00



CHITRA

# చందమామ కబుర్లు



## అతి ఖరీదయిన చేతి గడియారం

జెనీవాలో చేతి గడియారాలు తయారు చేసే ఒక సంస్థ 150 సంవత్సరాలు పూర్తి చేసుకున్న సందర్భంగా, ఆ సంస్థలోని నిపుణుల బృందం తొమ్మిదేళ్ళు కృషిచేసి ప్రత్యేకమైన ఒక చేతి గడియారం తయారు చేసింది. దానిని వేలానికి వదిలారు. అది రెండు నిమిషాలలో 27 లక్షలా 40 వేల డాలర్ల ఖరీదుకు అమ్ముడై పోయింది.

## పొడవైన కారు

ఫిన్లండులో రూపొందించబడిన ప్రపంచంలోకెల్లా చాలా పొడవైన కారు మొట్టమొదటిసారిగా హెల్సింకీలో విడుదల చేయబడింది. 21.93 మీటర్లు పొడవైన ఈ కారు, అంతకు పూర్వం పొడవైనదిగా వున్న 21 మీటర్ల జపాన్ కారు రికార్డును అధిగమించి 'గిన్నీస్ బుక్'లో చోటు సంపాయించనున్నది.





## ధ్యానం చేసే పిల్లి!

క్వాలాలంపూర్‌లోని ఒక బుద్ధమందిరానికి రోజూ తప్పకుండా సంవత్సర కాలంగా ఒక పిల్లి వస్తున్నది. ఇదేమీ విశేషం కాదు. వింతేమిటంటే — ఆ పిల్లి ధ్యానంలో కూర్చుని వున్న భక్తుల మధ్యకు వెళ్ళి, తన వెనక కాళ్ళపై కూర్చుని, ముందు కాళ్ళెత్తి దణ్ణం పెడుతుంది. భక్తులు ధ్యానంలో వున్నంత సేపూ పిల్లి కూడా అలాగే వుంటున్నది.

## హాస్య చతురుడు

బెల్‌గ్రేడ్‌కు చెందిన మిరుస్లావ్‌లోవిక్ అనే పెద్దమనిషి ప్రేక్షకులను విరామం లేకుండా 55 గంటలసేపు నవ్వించి ప్రపంచ రికార్డు సృష్టించాడు. ఆ సమయంలో ఆయన, చెప్పిన జోకును చెప్పకుండా ఉపన్యాసం సాగించాడు.



# సాధువూ - రైతూ

ఒక చిన్న పల్లెకు, ఒక సాధువు వచ్చి చెరువుగట్టున వున్న మర్రిచెట్టుకింద లేడి చర్మం పరుచుకుని కూర్చున్నాడు. పల్లెవాసులు ఆయనముందు పళ్ళూ ఫలహారాలూ పెట్టి వెళ్ళిపోసాగారు.

సాధువు వాళ్ళతో, "సూర్యాస్తమయం యింకా ఒకటి, రెండు గంటలున్నదనగా రండి. భక్తి, వైరాగ్యాల గురించి మీకు విపులంగా చెప్పదలిచాను," అని అన్నాడు.

అయితే, తొలకరివానలు కురిసి మంచి వ్యవసాయప్పనుల తరుణం కావడంతో, సూర్యాస్తమయానికి కొంచెం ముందుగా, ఆయన దగ్గిరకు ఒకే ఒక వ్యక్తి వచ్చాడు. అతడు పల్లెలో చిన్న రైతు.

సాధువు అతణ్ణి చూసి నిరుత్సాహంగా, "మీ పల్లెవాసులముందు ఎన్నో విషయాల గురించి మాట్లాడాలనుకున్నాను. నువ్వు ఒక్కడివే వచ్చావు. మాట్లాడమంటావా?" అని అడిగాడు.

అందుకు రైతు, "స్వామీ, నేను ఎంతో పశువుల మేత తీసుకుని, అవి వుండే చావడిలోకి వెళ్ళినప్పుడు, అక్కడ ఒకే ఒక ఆవు వున్నా, దానికి మేత వేస్తాను," అన్నాడు.

ఈ జవాబుకు సాధువు తృప్తిపడి, దాదాపు రెండు గంటల కాలం భక్తి, వైరాగ్యాల గురించి ప్రసంగం కొనసాగించాడు.

తర్వాత ఆయన, రైతును, "నా ప్రసంగం ఎలా వున్నది?" అని అడిగాడు.

రైతు వినయంగా, "స్వామీ, నేను పశువుల చావడిలోకి చాలా మేత తీసుకుపోయినా, అక్కడ వున్న ఒక ఆవు చేత దాన్నంతా తినిపించే ప్రయత్నం చెయ్యను!" అని, అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

—వి. చైతన్య





# విభూతిమిశ్రుడి మానవత్వం

ఒకానొకప్పుడు చంపకదేశాన్ని, విభూతిమిశ్రుడనే రాజు పరిపాలించేవాడు. నిజం చెప్పడంలో ఆయన, హరిశ్చంద్రుణ్ణి మించినవాడని చెప్పుకునేవారు. ఈ విషయం దేవలోకం దాకా పాకింది.

ఒకనాడు దేవలోకంలో కొందరు దేవతలు సమావేశమై వుండగా, ఒకడు లేచి సమావేశం పెద్దతో, ''పూర్వం విశ్వామిత్రుడంతటివాడు, హరిశ్చంద్రుడి సత్యసంధతను స్వయంగా పరీక్షించవలసి వచ్చింది. ఈ విభూతిమిశ్రుడు మహారాజు కావడంవల్ల, తనను గురించి లేనిపోని గొప్పలు ఆపాదించుకుంటున్నాడని, నా నమ్మకం. ఇతణ్ణి ఒకసారి పరీక్షకు గురిచేయడం బావుంటుందిగదా!'' అన్నాడు.

ఇందుకు దేవతలందరూ సరేనని, తమలో ఒకణ్ణి దూతగా చంపకదేశానికి పంపారు. ఆ దేవదూత సత్యమూర్తి అనే పేరు పెట్టుకుని మనుషుల మధ్య తిరుగుతూ, నిజం చెప్పడంలో తనంతటివాడు లేడని ప్రచారం చేసుకోసాగాడు. అందుకు ఋజువులు కూడా చూపాడు.

వాడొకరోజున ఒక గ్రామంలో పదిమందినీ పిలిచి, ''ఏదో దివ్యశక్తి నా చెవిలో నిత్యం ఎవరికీ తెలియని విశేషాలు చెబుతూంటుంది. ఆ ప్రకారం, అదుగో, ఆ భూషయ్య ఇంటి పెరట్లో వేపచెట్టు కింద లంకెలబిందెలున్నాయి,'' అని చెప్పాడు.

తవ్వి చూస్తే అక్కడ నిజంగానే లంకెల బిందెలున్నాయి.

దీనితో సత్యమూర్తిని, ప్రజలు దైవంలా ఆరాధించసాగారు. ఎందరో అతడివల్ల ఎన్నో ప్రయోజనాలు పొందారు.

అయితే, సత్యమూర్తి కొందరిని అంటరానివాళ్ళంటూ, తనవద్దకు రానిచ్చేవాడు

"వసుంధర"



రానితనాన్ని మాత్రం రూపుమాపడం కష్టంగా వున్నది. ఆయన శాసనం కారణంగానూ, శిక్ష తీవ్రమైనదికావడం వల్లా, ప్రజలు భయపడి బయిటికి చెప్పక పోయినా, మనసులో యింకా అంటరాని తనాన్ని నమ్ముతూనే వున్నారు. దాని కిప్పుడు సత్యమూర్తి ఉదంతం తోడ యింది. అందువల్ల ప్రతి గ్రామంలోనూ, మళ్ళీ అంటరానివారిని వేరుచేయడం మొదలయింది.

ఈ విషయం విభూతిమిశ్రుడికి తెలి సింది. ఆయన వెంటనే సత్యమూర్తిని తనవద్దకు రావలసిందిగా భటుడి ద్వారా ఆజ్ఞాపించాడు.

"నేను ప్రజాసేవ చేసుకునే సత్పురు షుణ్ణి. రాజుల ఆజ్ఞలకు బద్ధుడనై ప్రజ లను విడిచి వెళ్ళలేను. రాజు నాతో మాట్లాడాలనుకుంటే, నా దగ్గరకు రావడం మంచిది," అని సత్యమూర్తి, రాజాజ్ఞను తెలియబరిచిన భటుడికి చెప్పాడు.

విభూతిమిశ్రుడు ఇది విని, సత్య మూర్తి సామాన్యుడు కాదని గ్రహించాడు. ఆయన వెంటనే బయలుదేరి, సత్య మూర్తి వుండే ఆశ్రమానికి వెళ్ళాడు. ఆశ్రమం ప్రజలతో క్రిక్కిరిసి వున్నది. అక్కడ ఒక రావిచెట్టు నీడలో చిన్న వేదిక మీద చిత్రాసనం వేసుకుని, దానిపై

కాదు. వాడు ప్రజలకు, "పాపాలు చేసిన మనిషి నరకానికి వెళ్ళడు. మరుసటి జన్మలో అంటరానివాడుగాపుట్టి, తన పాపా లకుశిక్షఅనుభవిస్తాడు. అంటరాని వాళ్లకు, యీ భూమి కారాగారం!" అని చెప్పాడు.

చంపక రాజ్యంలో రాజు విభూతి మిశ్రుడు, ఎన్నో సంస్కరణలను ప్రవేశ పెట్టివున్నాడు. ఆ ప్రకారం దేశంలో జాతి, మత, కుల వివక్షతలు లేకుండా మనుషు లందరూ సర్వమానవసమానత్వాన్ని పాటించాలి. అలా పాటించనివారు శిక్షార్హులు.

విభూతిమిశ్రుడు క్రమంగా అన్ని దురా చారాలనూ పోగొట్టగలిగాడు. కానీ, అంట

పద్మాసనం వేసి కూర్చున్నాడు సత్యమూర్తి. వాడి ముఖంలో దివ్యతేజస్సున్నది.

విభూతిమిశ్రుడు వాడికి నమస్కరించలేదు. వాడు చిరునవ్వునవ్వి, "మహారాజు నన్ను అహంకారం నీలో ఎక్కువైంది. సత్పురుషులకు నమస్కరించాలని కూడా తెలియదా?" అని ప్రశ్నించాడు.

ఇందుకు విభూతిమిశ్రుడు నవ్వి, "మనుషుల్లో అంతరాలు సృష్టించేవారు, సత్పురుషులు కానేరరు. అంటరానితనాన్ని సమర్థించే నీలాంటివాళ్ళకు, నేను నమస్కరించలేను," అన్నాడు.

"వెర్రివాడా! అంటరానితనాన్ని సమర్థిస్తున్నది, నేను కాదు. మన వేదాలు, పురాణాలు, ఇతిహాసాలు అంటరానితనాన్ని ప్రబోధిస్తూ సమర్థిస్తున్నాయి. అదే నేను ప్రజలకు చెబుతున్నాను," అన్నాడు సత్యమూర్తి.

"మన వేదాలు, పురాణాలు, ఇతిహాసాలు సత్ప్రవర్తనను సమర్థిస్తున్నాయి. జన్మనుబట్టి కాక ప్రవర్తననుబట్టి కులమని చెబుతున్నాయి. సత్ప్రవర్తన కలవాడు నాస్తికుడైనా గొప్పవాడని చెబుతున్నాయి. నీబోటి స్వార్థపరులు వాటికి, వక్రభాష్యం చెబుతున్నారు. ఈ దేశపు రాజుగా చెబుతున్నాను. నీ తప్పొప్పుకో," అన్నాడు విభూతిమిశ్రుడు.

సత్యమూర్తి, విభూతిమిశ్రుణ్ణి తీవ్రంగా చూసి, "నాకు దివ్యశక్తులున్నాయని, ఇప్పుడే ఋజువు చేస్తాను. చూడు!"





అంటూ గాలిలోకి చేయిచాపి అద్భుతాలు సృష్టించాడు. అందరూ చూస్తూండగా అప్పటికప్పుడు పైనుంచిపాములువర్షించి, మరుక్షణమే చెరుకుగడలుగా మారిపోయాయి. వాటిని వాడు, అక్కడున్న వారందరికీ పంచి తినమన్నాడు. అలాగే, ఎక్కడినుంచో గాండ్రిస్తూ పెద్దపులి వచ్చి, సత్యమూర్తి తాకగానే పిల్లిపిల్లగా మారిపోయింది.

విభూతిమిశ్రుడు ఈ అద్భుతాలు కొన్ని చూశాక, "నీ శక్తులు అద్భుతమైనవి కావచ్చుగానీ, వాటిలో దివ్యత్వం లేదు. నీకే గనక దివ్యశక్తులుంటే, మనుషుల్లో అంటరానితనాన్ని సమర్థించవు. ఏదో దురూహతో నువ్వు నా దేశానికి వచ్చి, అద్భుతశక్తులు ప్రదర్శించి ప్రజలకు అంటరానితనం గురించి అబద్ధాలు చెబుతున్నావు," అన్నాడు.

"రాజా, చాలించు నీ వాచాలత్వం!" అంటూ సత్యమూర్తి కళ్ళెర్రజేసి, "సత్యసంధతలో నేను హరిశ్చంద్రుణ్ణి మించినవాణ్ణి. అందుకు యిక్కడ వున్న ప్రజలే సాక్ష్యమివ్వగలరు," అన్నాడు.

"నీ కోపానికి నేను భయపడను. ఈ ప్రజలు సాక్ష్యమిచ్చినా నేను, నీ సత్యసంధతను నమ్మను. నన్ను నమ్మించడానికి ప్రత్యక్షసాక్ష్యం కావాలి," అన్నాడు విభూతిమిశ్రుడు.

ఈ మాటలకు సత్యమూర్తి పెద్దగానవ్వి, "అయితే సరే! నా సత్యసంధతను ఋజువుచేసి నీ కళ్ళు తెరిపించడానికి, నేనొక ఉపాయం చెబుతాను. ఆ ప్రకారం యీ రోజంతా నువ్వు అంటరాని వాళ్ళ మధ్య గడుపు. ఆ పాపఫలితమెలాగుంటుందో, రాత్రి నీకు కలలో కనబడుతుంది. ఆ కల ఏమిటో రేపు ఉదయం, యీ జనం సమక్షంలో నువ్వు నాకు చెప్పాలి," అన్నాడు.

"అలాగే చెబుతాను. అప్పుడైనా నీకళ్ళు తెరుచుకోగలవు!" అన్నాడు విభూతి మిశ్రుడు తాపీగా.

''ఒక్క విషయం గుర్తుంచుకో! నీవు కాని అబద్ధం చెప్పావో, వెంటనే భయంకరమైన చర్మవ్యాధికి గురవుతావు.'' అన్నాడు సత్యమూర్తి.

''ఒకవేళ నువ్వు అబద్ధం చెప్పినట్లు ఋజువైతే ?'' అని ప్రశ్నించాడు విభూతిమిశ్రుడు.

''అప్పుడు నేనీ రాజ్యంలో ఒక్క క్షణం కూడా వుండను. తక్షణం మాయమైపోతాను.'' అన్నాడు సత్యమూర్తి.

విభూతిమిశ్రుడు అక్కడి నుంచి బయలుదేరి, అంటరానివాళ్ళుండేచోటుకు వెళ్ళాడు. అక్కడ వాళ్ళ పరిస్థితి చూసి ఆయన మనస్సు కలత చెందింది. ''నా రాజ్యంలో మీరు మనుషులుగా కాక, జంతువుల్లా బ్రతుకుతున్నారు. రాజుగా నేనిది సహించలేను. రేపటినుంచీ మీరందరూ నలుగురితో కలిసి మసులుతారు.'' అన్నాడాయన.

అందుకు వాళ్ళు భయంగా, ''ప్రభూ, మాకు బ్రతుకు అవమానంగా వున్నా, మీ దయవల్ల తిండికి లోటు లేకుండా గడిచిపోతున్నది. సత్యమూర్తి నిజంగానే దేవాంశకలవాడని, మాకు తోస్తున్నది. మా కారణంగా మీకెలాంటి యిబ్బందీ కలకూడదు. మేము నిజంగానే శాపగ్రస్తులం. మమ్మల్ని యిలాగే బ్రతకనివ్వండి.'' అన్నారు.

అయినా విభూతిమిశ్రుడు వినలేదు. ఆ రోజంతా ఆయన వాళ్ళతో కలిసి స్నాన





పానాదులు చేశాడు. వాళ్ళు ప్రేమతో వండిపెట్టిన భోజనం తిని, వాళ్ళమధ్యనే పడుకుని నిద్రపోయాడు. పడుకోబోయే ముందాయన తమ కులదేవతను స్మరించుకుని, "అమ్మా, అన్నింటికీమించి నా ప్రజలే నాకు ముఖ్యం. ఈ రాత్రి నాకు మంచి కల వచ్చేలా చెయ్యి," అనుకున్నాడు.

అయితే, ఆ రాత్రి కలలో ఆయనకు ఒక దివ్యపురుషుడు కనిపించి, "వెర్రి రాజా! అంటరానితనం భూలోకంలోనే నరకం సృష్టించడానికి, స్వర్గవాసులు చేసిన ఏర్పాటు. ఎందుకంటే—పాపులెక్కువై నరకంలో చోటు లేకుండాపోయింది. నరకయాతనలు పాపులకు అంతగా బాధను కూడా కలిగించడం లేదు. అంటరానితనం నరకయాతనను మించినది. ఇది కలకాలం కొనసాగవలసిందే! ఈ శాసనాన్ని అతిక్రమించిన కారణంగా, ఒక రోజంతా నువ్వు ఎడారి పాలై ఆకలిదప్పులతో అలమటిస్తావు. ఇంకెన్నడూ యిలాంటి తప్పు చేయకు. రేపు యీ నిజాన్ని ప్రజలముందు వెల్లడిస్తే, ఈ రోజు నువ్వు చేసింది మొదటి తప్పుగా భావించి, నిన్ను క్షమిస్తాను," అని చెప్పాడు.

"ఒకవేళ నేను, నా కల గురించి అబద్ధం చెబితే?" అని అడిగాడు విభూతిమిత్రుడు.

"అప్పుడు నువ్వు భయంకరమైన చర్మవ్యాధికి గురై, నీ రాజ్యంలోనే అంటరానివాడివై అతి హీనమైన జీవితం గడుపుతావు. అదీగాక సత్యసంధతలో హరిశ్చంద్రుడికి సాటివాడివని, నీకు ముల్లోకాలలో గొప్ప కీర్తి వచ్చింది. ఇది నీకు పరీక్షా సమయం. ఈ పరీక్షలో విజయం సాధించి, నీ కీర్తి ఆచంద్ర తారార్కం భూలోకంలో స్థిరపడేలా చేసుకో," అన్నాడు దివ్యపురుషుడు.

"ఓఁ, దివ్యపురుషా! నేను మానవుణ్ణి. దైవత్వం నాలో మానవత్వాన్ని ప్రేరేపిం

చాలి తప్ప, నిరసించేలా చేయకూడదు. నాలోని మానవత్వానికి అడ్డుతగిలే దైవత్వాన్ని, నేను నమ్మను; లెక్క చేయను," అన్నాడు విభూతిమిశ్రుడు.

ఆ తర్వాత ఆయనకు మెలుకువ వచ్చింది. వచ్చిన కలను ఆయన గుర్తు చేసుకుని, "అమ్మా, కులదేవతా! నా ప్రజల క్షేమం కోరి అబద్ధం చెప్పడానికే, నేను నిర్ణయించుకున్నాను. అందువల్ల వచ్చే భయంకర చర్మవ్యాధిని భరించడానికి కూడా నేను సిద్ధం, కానీ నా వ్యాధి బైటకు కనిఫించకుండా వరమియ్యి. అంతేచాలు!" అనుకుని మనసులో కులదేవతను ప్రార్థించాడు.

మర్నాడు తెల్లవారుతూనే విభూతిమిశ్రుడు నదిలో స్నానం చేసి, సత్యమూర్తి ఆశ్రమానికి వెళ్ళి, వాడితో, "రాత్రి నాకు కలలో శ్రీమన్నారాయణుడు కనిపించి, అంటరానితనం మహాపాపమనీ, ఈ సత్యమూర్తి రాక్షసాంశ సంభూతుడనీ, రాక్షసమాయలతో ప్రజలను మోసం చేస్తున్నాడనీ చెప్పాడు," అన్నాడు.

అంతే! మరుక్షణం సత్యమూర్తి మాయమయ్యాడు. ప్రజలందరూ, తమ రాజుకు జయజయధ్వానాలు పలికారు. విభూతిమిశ్రుడిని ఎలాంటి చర్మవ్యాధీ బాధించలేదు.

ఆ రాత్రి ఆయనకు కలలో దివ్యపురుషుడు మళ్ళీ కనిపించి, "కులదేవత నీకు చెడ్డకల రాకుండా ఆపలేకపోయినా, ఆమెనే నమ్ముకుని ప్రజాక్షేమం కోసం, ఇటు చర్మవ్యాధిని భరించేందుకూ, అటు ముల్లోకాల్లోనూ నీకున్న పేరును కూడా త్యాగం చేసేందుకు సిద్ధపడ్డావు. నీవంటి నిస్వార్థప్రభువు మానవత్వం ముందు, నా దైవత్వం వెలవెలబోయింది. అంటరానితనం దేవుడు సృష్టించింది కాదు. నిన్ను పరీక్షించేందుకు అలా చెప్పవలసి వచ్చింది. ఈనాటి నుంచీ, నీ రాజ్యంలో సర్వమానవ సమానత్వం నెలకొంటుంది!" అని చెప్పాడు.



# షావుకారు విరాళం

షావుకారు శివయ్యకు బాగా జబ్బు చేసింది. ఆయన వైద్యుడితో, "ఈ మాయదారి జబ్బువల్ల శరీర బాధతోపాటు, బుద్ధికి కూడా నిలకడలేకుండా పోతున్నది. చెప్పవలసింది చెప్పలేక పోతున్నాను; చెప్పకూడదనుకున్నది చెప్పేస్తున్నాను!" అన్నాడు.

"నిరాశపడకండి! నా శక్తి కొద్దీ ప్రయత్నించి, మీ జబ్బు కుదురుస్తాను," అన్నాడు వైద్యుడు.

"నిజంగానా? అలా చేశారంటే, మీ వైద్యశాలకు లక్ష రూపాయలు విరాళమిస్తాను," అన్నాడు షావుకారు.

కొన్నాళ్ళ వైద్యం తర్వాత షావుకారు జబ్బు నయమైపోయింది. ఒకరోజున వైద్యుడు ఆయనను చూడవచ్చి, "మీకొక సంగతి గుర్తుచేయదలిచాను. మీరు జబ్బులో వుండగా, నా వైద్యశాలకు లక్ష రూపాయలు విరాళమిస్తానన్నారు," అన్నాడు.

"నిజమా? అసలు జబ్బే అది. చెప్పవలసింది చెప్పలేకపోవడం; చెప్పకూడనిది చెప్పేయడం!" అన్నాడు షావుకారు.

—రావులపాటి ప్రసాద్





# తండ్రీకొడుకులు

## 3

సత్యం వెచ్చాల అంగడినుంచి ఇంటికి తిరిగి వచ్చేసరికి చీకటిపడింది. దీపాలు పెట్టారు. వాళ్ళ ఇంటిముందు చీకట్లో నిలబడి ఒక కుర్రవాడు గట్టిగా ఈల వేస్తున్నాడు. సత్యం ఒళ్ళు ఒక్కసారి పొంగిపోయింది. ఆ ఈల వేసే వాడు రంగడు. తను కూడా జవాబుగా ఈల వేయటానికి ఉత్సాహంగా ప్రయత్నించాడు. కాని ఎంత ప్రయత్నించినా ఈల రాలేదు. సత్యానికి భలేకోపం వచ్చింది. కాని చేసేది లేక, "ఒరే, రంగడూ," అని కేక పెట్టాడు.

రంగడు తన దిక్కుగానే చూశాడు గాని తనకేసి చూడలేదు. వాడికా మసక చీకట్లో లావుపాటి శరీరమూ, బట్టతలా, నెరసిన మీసాలూ, కళ్ళజోడూ కనిపించింది.

"అట్లా చూస్తావేంరా, రంగడూ? నేనే," అన్నాడు సత్యం దగ్గరికి వస్తూ.

ఆ వచ్చే పెద్దమనిషి సత్యం తండ్రి అని తెలియగానే రంగడి పై ప్రాణాలు పైనే పోయాయి. తనతో స్నేహం చెయ్య వద్దని సత్యాన్ని ఎన్నోసార్లు ఈయనే కొట్టి వున్నాడు కూడానూ. ఆ కారణంచేతనే ఎప్పుడన్నా సత్యాన్ని పిలవవలిసివస్తే రంగడు ఇంట్లోకి రాక బయటనుంచి ఒక రకంగా ఈలవేస్తాడు. ఆ ఈల విని సత్యం రంగణ్ణి గుర్తించి బయటికి వస్తూ



ఉంటాడు. ఇప్పుడా రహస్యం కూడా సూరయ్యగారికి తెలిసి పోయిందనుకుని భయపడి, రంగడు చీకట్లోపడి దవుడు తీశాడు.

"ఎందుకురా, పారిపోతావ్? నేనేరా, వెధవా?" అంటూ సత్యం కేకపెట్ట సాగాడు. కాని, రంగడు వినిపించుకోకుండా పారిపోయాడు.

"ఏం, పంతులుగారూ? అబ్బాయి కోసమా కేక వేస్తున్నారు?" అని ఎవరో పలకరించారు. సత్యం ఇక వీధిలో ఆగక గబగబా ఇంట్లో జొరబడ్డాడు.

ఆ రాత్రి సత్యం తన తండ్రి పక్కలో పడుకున్నాడు.

"ఈ జీవితం చాలా బాగుంది. కావలసినంత డబ్బు; అందరూ గౌరవించేవాళ్ళే. ఎరగనివాళ్ళు పలకరించినప్పుడు మాత్రం చిక్కు. అదిన్నీ, తన పాతస్నేహితులు తనను చూసి భయపడి పోతున్నారు. అయినా, ఈ జీవితమే బాగుంది. పిల్లవాడుగా ఉండటంకన్న పాపం లేదు. ఈ ప్రపంచం పెద్దవాళ్ళది," అనుకున్నాడు సత్యం.

ఆ రాత్రి సత్యానికి సరిగా నిద్రపట్ట లేదు. మామూలుగా పెందలాడే నిద్ర పొయ్యేవాడు. ఇవాళ రాత్రల్లా పక్క మీద అటూ యిటూ దొర్లుతూనే ఉన్నాడు. సూరయ్యమటుకు మనసు ఎంత కలతగా ఉన్నా పెందలాడే పడుకుని, వెంటనే నిద్రపోయాడు.

సత్యానికి తెల్లవారకముందే మెలకువ వొచ్చింది. పక్క మీది నుంచి లేచి తోచని వాడల్లే కొంతసేపు అటూ ఇటూ ఇల్లంతా తిరిగాడు. గదిలోకి వెళ్ళి అద్దంలో తన బట్టతలా మీసాలూ ఒకసారి చూసుకున్నాడు. కళ్ళజోడు పెట్టుకుంటేగాని అదైనా సరిగా కనిపించలేదు.

సూర్యోదయమై గంట అయినప్పటికీ సూరయ్య లేవ లేదు. ఇంతలో బడినుంచి ఒక కుర్రవాడు వచ్చాడు. వాడు సత్యాన్ని ఎరిగినవాడే. అయినా గుర్తించక,

''ఏమండీ, మీ సత్యాన్ని పంతులవారు పిలుచుకు రమ్మన్నారు,'' అని చెప్పాడు.

సూరయ్య లేచాడు. అలవాటుప్రకారం వంటలక్కను కేక పెట్టాడు. కాని వంట లక్క కేక విని కూడా పలకలేదు. ఇంతలో తన కొడుకు ఈడు కుర్రవాడు లోపలికి వచ్చి, ''ఔరే, నిన్ను పంతులుగారు పిలుచుకు రమ్మన్నారు,'' అని చెప్పాడు.

సూరయ్యకు కోపమూ, ఏడుపూ కూడా వచ్చాయి.

''ఛీ, ఎవడ్రా నువు? ఫో అవతలికి. నీ పంతుల్నిట్లా రమ్మను,'' అన్నాడు సూరయ్య.

కాని సూరయ్య బడికి వెళ్ళక తప్ప లేదు. బడి నుంచి వచ్చిన కుర్రవాడు గట్టివాడు. వాడంటే పిల్లలందరికీ చెప్పరా నంత హడలు. ఎవరు బడికి రాకపోయినా పంతులు వాణ్ణి పంపిస్తాడు. సూరయ్య వాడికి చిక్కకుండా తప్పించుకోలేక పోయాడు.

సూరయ్యను చూడగానే పంతులు పేముబెత్తం తీసుకుని రెండు చేతుల మీద నాలుగేసి దెబ్బలుకొట్టి గోడకుర్చీ వేయించి, ''మీ తండ్రిగారు ఎంత పెద్ద మనిషి! ఆయనకు నీవంటి దౌర్భాగ్యుడు పుట్టటం ఆశ్చర్యంగా ఉంది. రానురాను నీ ఆటలు మితిమీరి పోతున్నాయి. ఇక నిన్ను చూసి ఊరుకునేదిలేదు. బంద కొయ్య వేస్తాను. ఏమనుకున్నావే,'' అని మందలించాడు.





చేరగిలపడి నోట్లోకి ఈగ వెళ్ళింది కూడా తెలియకుండా గురకపెట్టి నిద్రపోయాడు. పిల్లలు అల్లరి ప్రారంభించారు..

పిల్లలంతా సూరయ్య చుట్టూ మూగారు. అందరూ తనని "సత్యం" అని పిలిచే వాళ్ళే కాని ఒక్కరిపేరూ తనకు తెలీదు. ఒక్కరి మొహమూ తను ఎరగడు. ఆ సంగతి పిల్లలకేం తెలుస్తుంది? సత్యం పొగరుపట్టి తమతో మాట్లాడటం లేదనుకున్నారు. అందువల్ల అందరూ కలిసి సూరయ్యను ఏడిపించటం మొదలు పెట్టారు. ఒకడు చెవిగిల్లాడు. మరొకడు తొడపాశం పెట్టాడు. ఈ కుర్రవెధవలు తనను యింత చులకన చేస్తున్నారని రోషమూ, ఏమీ చెయ్యటానికి లేకపోవటం వల్ల దుఃఖమూ సూరయ్యను బాధించాయి. అఖరుకు భరించలేక ఒక్క పొలికేక పెట్టాడు సూరయ్య. అతను అంత పని చేస్తాడని పిల్లవాళ్ళెవరూ అనుకోలేదు. పంతులు లేస్తాడని వాళ్ళకు తెలుసు. అందుచేత చప్పున ఎవరిధారిన వాళ్ళు యేమీ ఎరగనట్టుగా కూచున్నారు.

పంతులు లేవనే లేచాడు. లేస్తూనే బెత్తంతీసుకుని సూరయ్యను బాదసాగాడు. సూరయ్యకు మతిపోయినట్టయింది.

"నీ చదువు చట్టుబండలు గానూ! ఇందుకేనా నేనింత డబ్బిచ్చిందీ? ఉండు

సూరయ్యకు కళ్ళనీళ్ళు బొటబొటా కారాయి. ఇంత అవమానం పొందటం కన్న చచ్చిపోవటం మేలనిపించింది. ఆ పంతుల్నీ, ఆయన చదువుచెప్పే పద్ధతినీ, అక్కడి పిల్లల్నీ చూస్తే సూరయ్యకు ఆశ్చర్యమూ, కోపమూ కూడా వచ్చింది. ఇదేం పంతులు? ఇదేం చదువు? పాపం, సత్యం యిటువంటి అర్థం లేని చదువు చదువుతున్నాడా?

కాస్సేపు పిల్లలంతా ఎక్కాలు వల్లె వేశారు. ఆ తరవాత నెలలపేర్లూ, తిథుల పేర్లూ వల్లెవేశారు. అంతాకలిసి అరుస్తుంటే కాకిగోల. ఆ తరవాత పిల్లల్ని అల్లరి చెయ్యవద్దని చెప్పి పంతులు గోడకి

నిన్నేంచేస్తానో! మాటి మాటికీ బెత్తం తీసుకుని పిల్లల్ని చావగొడతావుట్రా? నీ చేతులు పడిపోనూ!" అని సూరయ్య పంతుల్ని తిట్టసాగాడు.

మిగిలిన పిల్లలంతా గట్టిగా నవ్వ సాగారు. పంతులు ఒక్క క్షణంపాటు నిర్ఘాంతపోయాడు. యేమనుకున్నాడో యేమిటో సూరయ్యను వెళ్ళి గోడకుర్చీ వెయ్యమన్నాడు. సూరయ్యకి క్షణ క్షణానికీ పరాభవం జాస్తి అవుతున్నది కాని తగ్గటంలేదు.

పంతులు సూరయ్యని పరీక్ష ప్రారంభించాడు. పంతులు వేసిన ప్రశ్నలు కొన్ని సూరయ్య సులభంగానే చెప్పాడు. కాని మరికొన్నిటికి చెప్పలేక పోయాడు. పుస్తకం చదివితేగాని తెలియని విషయాలకు సూరయ్య ఎట్లా సమాధానం చెబుతాడూ?

గోడకుర్చీ వెయ్యటం సూరయ్యకు దుర్భరమయింది. పిల్లలందరూ వేళాకోళం ప్రారంభించారు. గోడకుర్చీ వేసి సూరయ్య అలుసైపోయాడు. పంతులు వాళ్ళనేమీ అనలేదు.

పంతులు లెక్కలిచ్చాడు. పంతులు లెక్కచెప్పటం ఇంకా పూర్తికాకముందే సూరయ్య సమాధానాలు చెప్పసాగాడు. పంతులుకు ఆశ్చర్యం వేసింది. సత్యం లెక్కల్లో మొద్దు. అటువంటివాడు తడువుకోకుండా నోటి సమాధానాలు చెప్పటం పంతులుకు ఆశ్చర్యంగా ఉండదూ?



"దొంగవెధవా, ఇంతకాలమూ నీకు లెక్కలు బాగా వచ్చి ఉండి కూడా నా దగ్గిర మొండితనం చేసి రానట్టు నటిస్తున్నావా?" అని పంతులు సూరయ్యని రెండు వేశాడు.

ఎప్పుడు మధ్యాన్నమవుతుందా? ఎప్పుడు పంతులు బడి విడిచిపెట్టి ఇంటికి పోతాడా అని సూరయ్య ఎదురుచూడ సాగాడు. ఎట్లాగైతేనేం పంతులుగారు బడి చాలించాడు. మామూలు పిల్లవాడయితే బడివదిలిన మరుక్షణం తిన్న దెబ్బలూ, చివాట్లూ మరిచిపోతాడు. కాని సూరయ్య యిన్నేళ్ళు వచ్చినాక జరిగిన ఈ పరాభవం ఎట్లా మరుస్తాడు? అందరు పిల్లలూ ఇంటికి బయలుదేరారు. కొందరు పరిగెత్తారు. కొందరు ఒయ్యారపునడకలు నడుచుకుంటూ, చీకూ చింతా లేకుండా బయల్దేరారు. సూరయ్య తప్ప అందరూ ఉత్సాహంగానే ఉన్నారు.

అందులో కొందరు సూరయ్య చుట్టూ చేరి, "ఏంరా, సత్యం? ఏం జరిగిందో చెప్పవూ? నువు బొత్తిగా కొత్తమనిషల్లే ఉంటున్నావే!" అని గుచ్చి గుచ్చి అడిగారు. సూరయ్య విసుక్కుని, "నేను కొత్త మనిషినే అసలు నా పేరు సత్యం కాదు. అలా నన్ను పలకరించకండి," అన్నాడు.

ఇంటికిపోయి ఏం చెయ్యాలి? ఇంట్లో సత్యం ఏం చేస్తున్నాడో? వాడి రహస్యం ఈపాటికి అందరూ కనుక్కుని ఉంటారనుకున్నాడు సూరయ్య. ఈ ఆలోచనతో పారిపోయిన ఆశ మళ్ళీ తిరిగి రాసాగింది. తనను సూరయ్యంటే నమ్మరు నిజమే. కాని సత్యాన్ని చూసి తనే అనిమటుకు ఎవరు నమ్ముతారూ? తన స్నేహితులెందరో వస్తారు. వ్యవహారాలు మాట్లాడగలరు. అవన్నీ సత్యానికేం తెలుసూ? అందుచేత సత్యం గుట్టు ఈపాటికి బయటపడి ఉంటుంది. సత్యం గుట్టు బయటపడితే తన విషయం సులభంగా రుజువు అవుతుంది.

ఈ ఆశతో సూరయ్య ఇంటికి బయలుదేరాడు. —(ముగింపు వచ్చేసంచికలో)





# తెలివైనవాడు

మాయావతి అనే గ్రామంలో, సోమసుందరు డనే సంపన్ను డుండేవాడు. ఆయన పొరుగున శరభయ్య అనే పెద్ద రైతు వున్నాడు. సోమసుందరుడు గతంలో, అతడితో ఒక చిన్న విషయంలో తగువు పడడం జరిగింది. అది మనసులో పెట్టుకుని శరభయ్య, సోమసుందరుడిపట్ల వైరం పెంచుకున్నాడు.

ఒకసారి సోమసుందరుడు కుటుంబంతో సహా పొరుగూరు వెళ్ళినప్పుడు, శరభయ్య తన మేకలను అతడి పెరట్లోకి తోలి కూరపాదుల్నీ, పూలమొక్కలనూ సర్వనాశనం చేయించాడు. మరొకసారి దూరప్రాంతం నుంచి ధనవంతుడొకడు, తన కొడుకుకు సోమసుందరుడి కుమార్తెను చేసుకోవాలని వస్తే, ఆయనకు శరభయ్య లేనిపోనివి కల్పించి చెప్పి, ఆ సంబంధం కుదరకుండా చేశాడు.

ఇది జరిగాక సోమసుందరుడు, పొరుగున శత్రువు వుండడం క్షేమం కాదని, శరభయ్యతో రాజీపడాలని నిశ్చయించుకున్నాడు. అయితే, తనకు తానుగా రాజీకి దిగితే లోకువకాగలనని వూరుకున్నాడు.

ఒకనాడు సోమసుందరుడి దగ్గిరకు, సారంగుడనేవాడు చేబదులుగా కొంత డబ్బు అడగడానికి వచ్చాడు.

సోమసుందరుడు, సారంగుడితో, "నువ్వు తెలివైనవాడివని చాలామంది అంటూంటారు. కానీ ఆ తెలివితేటలేపాటివో యింతవరకూ నేనెరగను!" అన్నాడు.

ఆ మాటలకు సారంగుడు నవ్వి, "అయ్యా, నేను తమ దగ్గిరకు చేబదులుకు వచ్చినవాణ్ణి! నన్ను ఎలాంటి పరీక్షకైనా గురిచేసే హక్కు తమకున్నది," అన్నాడు.

"సరే, ఐతేవిను. శరభయ్య, నాతో రాజీపడేలా చేశావంటే నువ్వు తెలివైన

దాసరి వెంకటరమణ

వాడివని ఒప్పుకుంటాను," అన్నాడు సోమసుందరుడు.

సారంగుడు సరేనని వెళ్ళిపోయాడు.

ఆ మర్నాడు శరభయ్య, సోమసుంద రుడి ఇంటికి వచ్చి, "గతంలో జరిగిన దానికి క్షమాపణ కోరవచ్చాను. ఇక నుంచి మనం సఖ్యతగా వుందాం. అన్నట్టు—మావాడికి పెళ్ళి సంబంధం కుదిరింది. వచ్చే మాసంలో ముహూర్తం. పెళ్ళికి మీరు తప్పక రావాలి." అని చెప్పి వెళ్ళిపోయాడు.

సోమసుందరుడు, శరభయ్యలో వచ్చిన మార్పుకు ఆశ్చర్యపోయి, సారంగుడు రాగానే, "సారంగా, శరభయ్యతో ఏం చెప్పావు?" అని అడిగాడు.

సారంగుడు చిరునవ్వునవ్వి, "ఇంటి పొరుగున వున్నవాళ్ళతో శత్రుత్వం కొన సాగించడంవల్ల, కలగబోయే కీడుగురించి శరభయ్యకు వివరించాను. అంతేకాక, ఎదుటివాళ్ళకన్న మనమే తెలివైనవాళ్ళ మని నిరూపించుకోవాలంటే—లౌక్యంగా శత్రుత్వాన్ని, మిత్రత్వంగా మార్చుకో వాలని చెప్పాను," అన్నాడు.

"అంటే, నీ దృష్టిలో శరభయ్యే, నాకన్న తెలివైనవాడు! అవునా?" అని అడిగాడు సోమసుందరుడు కోపంగా.

"మీరు శరభయ్యకంటే చాలా తెలివైన వారు. అలా కాకపోతే, ముందుగా నన్ను, శరభయ్య వద్దకు ఎందుకు రాజీకి పంపిస్తారు?" అన్నాడు సారంగుడు.

సోమసుందరుడు ఆ జవాబుకు తృప్తి పడి, "అయితే, మనిద్దరిలో ఎవరు తెలి వైనవారంటావు?" అని ప్రశ్నించాడు.

"నిస్సందేహంగా నాకంటే మీరే తెలి వైనవారు. ఎందుకంటారా? డబ్బు అవ సరంగావుండి వచ్చిన నా బలహీనత కనిపెట్టి, ఎంతో తెలివిగా మీ మధ్య రాజీ కుదర్చడానికి నన్ను ఉపయోగించు కున్నారు," అన్నాడు సారంగుడు.

ఆ మాటలకు సోమసుందరుడు నవ్వి, "నిజంగా నువ్వు తెలివైనవాడివి!" అని సారంగుడికి డబ్బిచ్చి పంపాడు.





# జయశీలుడి నిర్ణయం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత భయంకరమైన కాళరాత్రిలో నువ్వు పడుతున్న శ్రమ చూస్తూంటే నాకు అమితాశ్చర్యం కలుగుతున్నది. కఠినమైన ఈ పనికి నిన్ను పురికొల్పినవారి స్వభావం ఎటువంటిదో నాకు తెలియదు. అయినా, నువ్వు తలపెట్టిన కార్యం సాధించేవరకు ఇలాంటి పట్టుదలతో ఉండగలవో లేదో అనే అనుమానం కలుగుతున్నది. ఎందుకంటే మానవస్వభావం చంచలమైనది; అందులోనూ రాజుల మనసులు మరీ చంచలమైనవి. ఇందుకు ఉదాహరణగా, తన అర్ధాంగిని ఎన్నుకోవడంలో మనోచాంచల్యానికి లోనైన విజయపురి యువ

## బేతాళ కథలు



రాజు జయశీలుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు :

విజయపురి మహారాజు మహేంద్రవర్మ ఏకైక కుమారుడు జయశీలుడు. మహేంద్రవర్మ ఒకనాడు అతణ్ణి రహస్య మందిరానికి పిలిచి, ''జయశీలా, నువ్వు క్షాత్రవిద్యలన్నిటిలోనూ ఆరితేరావు. చాలా సంతోషం. ఇప్పుడు నీకు వివాహం జరిపించాలనుకుంటున్నాను. నాకు కాబోయే కోడలు దయాస్వభావం కలదిగానూ, గుణవతిగానూ ఉండాలని ఆశిస్తున్నాను. ఆమె రాజవంశానికి చెందినది కాకపోయినా ఫరవాలేదు!'' అన్నాడు.

''మీ కోడలుగా రాదగిన ఉత్తమురాలిని అప్పుడే నిర్ణయించారా, నాన్నా?'' అని అడిగాడు తండ్రిని జయశీలుడు ఎంతో వినయంగా.

''లేదు. అయినా, నా బాల్యస్నేహితుడైన కాత్యాయనీ రాజు ఇంద్రసేనుడి కుమార్తె వైజయంతిని పదేళ్ళప్రాయంలో చూశాను. చాలా ముచ్చట కలిగింది. ఆమె ఇప్పుడు యుక్తవయస్కురాలు. ఆమె నీకు అన్నివిధాలా తగిన భార్య కాగలదని భావిస్తున్నాను. కావాలంటే నువ్వు కాత్యాయనీ రాజ్యానికి వెళ్ళి, రాజభవనంలో కొన్నాళ్ళు గడిపి యువరాణి స్వభావం ఎటువంటిదో పరిశీలించి రావచ్చు,'' అన్నాడు మహేంద్రవర్మ చిన్నగా నవ్వుతూ.

''అలాగే వెళ్ళివస్తాను. అయితే, యువరాజు జయశీలుడిగా కాదు. వర్తకుడిలా కాత్యాయనీ రాజధానీ నగరంలో కొన్నాళ్ళు గడిపి రావడానికి నన్ను అనుమతించండి. నేనెవరయినదీ చెప్పకుండా, అక్కడ కొన్నాళ్ళుండి, యువరాణిని గురించిన వివరాలు తెలుసుకుని వస్తాను,'' అన్నాడు జయశీలుడు.

''మంచి ఆలోచన. అయితే, నీకు అంగరక్షకులుగా ఇద్దరిని వెంటబెట్టుకుని వెళ్ళిరా,'' అన్నాడు మహేంద్రవర్మ.

మరునాడే జయశీలుడూ, ఇద్దరు అంగరక్షకులూ వర్తకుల వేషంలో కాత్యాయనీ నగరానికి ప్రయాణమయ్యారు. కొద్ది రోజుల తర్వాత వాళ్ళు కాత్యాయనీ నగరం చేరి అక్కడ ఒక సత్రంలో దిగి, రెండు గదులను అద్దెకు తీసుకున్నారు. ఒక గదిలో జయశీలుడూ, రెండవ గదిలో ఇద్దరు అంగరక్షకులూ బస చేశారు. దూరదేశం నుంచి, కొత్తవ్యాపారం ప్రారంభించడానికి నగరానికి వచ్చినట్టూ, అందుకోసం నగరంలోని ప్రముఖవ్యాపారులతో సంప్రదింపులు జరపడానికి సత్రంలో బస చేసినట్టూ, వాళ్ళు, సత్రం యజమానికి చెప్పారు.



దురదృష్టవశాత్తు మర్నాడే జయశీలుడికి తీవ్రమైన జ్వరం వచ్చింది. దయాస్వభావుడయిన సత్రంయజమాని, జయశీలుడి స్థితి చూసి ఎంతగానో జాలిపడి, అతణ్ణి తమ ఇంటికి తీసుకుపోయాడు. వెంటనే నగరంలో పేరుగాంచిన వైద్యుణ్ణి పిలిపించాడు.

వైద్యుడు జయశీలుణ్ణి పరీక్షించి, "రోగిని చాలా జాగ్రత్తగా చూసుకోవాలి. నేనిచ్చే మందును, తెల్లవారేవరకు గంటకొకసారి ఇస్తూ వుండాలి. లేకుంటే ప్రాణానికే ప్రమాదం," అని హెచ్చరించి, మందిచ్చి వెళ్ళిపోయాడు.

సత్రం యజమానికి భార్యలేదు. ఇంట్లో పెళ్ళీడు వచ్చిన ఆయన కూతురు ఇందుమతి ఒక్కతే ఉన్నది. ఆమె వైద్యుడు చెప్పిన విధంగా తెల్లవార్లూ మేలుకొని వుండి, జయశీలుడికి మందు ఇచ్చింది. ఆ ఒక్కరాత్రి మాత్రమేకాక, మరొక వారంపాటు ఎంతో శ్రమపడి వైద్యుడు చెప్పినట్టు జయశీలుడికి పరిచర్యలు చేసింది. ఏడవనాటికి జ్వరం తగ్గింది. కాని, జయశీలుడు చాలా నీరసంగా తయారయ్యాడు. అతడు మామూలు మనిషి కావడానికి మరొక వారం రోజులు విశ్రాంతి తీసుకోవలసి వచ్చింది. ఇన్ని రోజులూ, ఇందుమతి అతని పక్కనే



వుండి, ఎంతో అనురాగంతో పరిచర్యలు చేసింది. ఆమె కరుణా స్వభావం, మంచితనం చూసి జయశీలుడు ముగ్ధుడయ్యాడు. అంతేగాక, ఇందుమతి తనను ప్రేమిస్తున్నట్టు అతడు గ్రహించాడు.

జయశీలుడు పూర్తిగా కోలుకున్న తరవాత, ఒకనాడు ఇందుమతిని దగ్గిరికి పిలిచి, "రాజకుటుంబంలో నువ్వు ఎరిగిన వాళ్ళెవరయినా ఉన్నారా?" అని అడిగాడు.

"రాజకుటుంబంలో అందరూ నాకు పరిచితులే. యువరాణి వైజయంతీదేవి చెలికత్తెలలో నేనొకతెను. రోజూ సాయంకాలం రాజభవనానికి వెళ్ళి, రాకుమారితో కొంతసేపు ముచ్చటించి వస్తూంటాను. మీ అనారోగ్యం కారణంగా రెండు వారాల నుంచి నేనటువైపు వెళ్ళలేదు," అన్నది ఇందుమతి.

"అయితే, నువ్వు నాకొక సహాయం చెయ్యాలి," అన్నాడు జయశీలుడు.

"ఏమిటది?" అని అడిగింది ఇందుమతి.

"మీ యువరాణి ఏ రాజకుమారుణ్ణయినా పెళ్ళాడాలనుకుంటున్నదేమో తెలుసుకుని రావాలి!" అన్నాడు జయశీలుడు.

"ఆ రహస్యం మీకెందుకు?" అని ప్రశ్నించింది ఇందుమతి ఆశ్చర్యంగా.

"విజయపురి యువరాజు జయశీలుడు నా ప్రాణమిత్రుడు. అతడు మీ యువరాణిని వివాహమాడాలనుకుంటున్నాడు. అయినా, ఇంకా ఒక నిర్ణయానికి రాలేదు. ఎందుకంటే, ఒకవేళ మీ యువరాణికి మరెవరినైనా వివాహమాడాలనే కోరిక ఉన్నదేమో అని ఆయనకు అనుమానంగా ఉన్నది. ఆమె ఇంతవరకు ఎవరినీ కోరని పక్షంలో, ఆమెనే వివాహమాడదలచినట్టు నాతో చెప్పాడు. అందువల్ల, నాకీ రహస్యం తెలియాలి," అన్నాడు జయశీలుడు.

"అలాగా, అయితే దయచేసి మీరు నాకు రెండు మూడు రోజులు గడువివ్వండి.

రాకుమారితో మాట్లాడి వస్తాను,'' అన్నది ఇందుమతి.

అలాగే అన్నాడు జయశీలుడు.

ఆ రోజు నుంచి ఇందుమతి మళ్ళీ రాజభవనానికి వెళ్ళడం ప్రారంభించింది. మూడవరోజు సాయంకాలం, ఆమె రాజ భవనం నుంచి తిరిగివస్తూండగా, ఆమె కోసం ఎదురుచూస్తున్న ఆమె తండ్రి, ''ఇందుమతీ, ఇప్పుడు మన ఇంట అతిథిగా వున్న వారెవరో నీకు తెలుసా? విజయపురి యువరాజు జయశీలుడు. ఆయనతోపాటు వచ్చి మన సత్రంలో బసచేసి వున్న, ఆయన అంగరక్షకులు, ఈ రహస్యం నాకు చెప్పారు,'' అన్నాడు మెల్లగా.



''అలాగా,'' అన్నది ఇందుమతి ఎంత మాత్రం ఉత్సాహం కనబరచకుండా.

''అయినా, ఆయన మామూలు వర్తకుడిలా, మన నగరానికి ఎందుకు వచ్చాడో అంతుబట్టడం లేదు,'' అన్నాడు ఇందుమతి తండ్రి ఆశ్చర్యంగా.

''యువరాజు వచ్చిన కారణం నాకు తెలుసు, నాన్నా. ఆయన మన యువరాణిని వివాహమాడాలనుకుంటున్నాడు. కాని, మన యువరాణికి ఎవరినైనా పెళ్ళాడాలనే కోరిక ఉన్నదేమో తెలుసుకోవాలని వచ్చాడు. ఆ సంగతి తెలుసుకొమని నాతో చెప్పాడు కూడా. మన యువరాణికి ఎవరిమీదా కోరిక లేనట్టయితే, ఆమెనే వివాహ మాడగలడు,'' అన్నది ఇందుమతి.

''నువ్వు తెలుసుకున్న విషయం ఏమిటి?'' అని అడిగాడు తండ్రి.

''యువరాణికి ఎవరిపట్లా అటువంటి కోరిక లేదని తెలుసుకున్నాను,'' అన్నది ఇందుమతి.

''మహేంద్రపుర యువరాజుతోనూ, విక్రమపురి యువరాజుతోనూ మన యువరాణి చాలా స్నేహంగా వుంటుందన్న విషయం నేనెరుగుదును. ఆ సంగతి నీకూ తెలుసు. మన అతిథికి నువ్వు ఈ



నిజం కూడా తెలియజేయాలి, తల్లీ,'' అన్నాడు ఇందుమతి తండ్రి.

''తప్పకుండా నిజమే చెబుతాను, నాన్నా,'' అన్నది ఇందుమతి.

సత్రం యజమాని లోలోపల పరమానందం చెందాడు.

ఇందుమతి జయశీలుడి దగ్గరికి వెళ్ళి, ''మా యువరాణి ఇంతవరకు ఎవరినీ పెళ్ళాడాలనుకోలేదు. నీ మిత్రుడికి, ఆమెను వివాహమాడమని చెప్పవచ్చు. వైజయంతీదేవి గుణవంతురాలు; గుణానికి తగిన సౌందర్యవతి,'' అన్నది ఇందుమతి.

''మీ సహాయానికి కృతజ్ఞతలు. కాని, యువరాజు వేరొకరిని వివాహమాడాలని నిశ్చయించాడు,'' అన్నాడు జయశీలుడు చిన్నగా నవ్వుతూ.

''ఎవరిని?'' అన్నది ఇందుమతి ఆశ్చర్యపోతూ.

''ఇందుమతిని!'' అన్నాడు జయశీలుడు.

ఇందుమతి సిగ్గుతో తల వంచుకున్నది.

జయశీలుడు తను ఎవరయినదీ తెలియజేసి, ఆమె తండ్రి సమ్మతించినట్టయితే ఆమెను వివాహమాడగలనని చెప్పాడు.

ఒక శుభముహూర్తాన ఇందుమతీ, జయశీలుల వివాహం ఎంతో వైభవంగా జరిగింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, యువరాణిని పెళ్ళాడాలని వచ్చిన జయశీలుడు, ఆమె చెలికత్తెను పెళ్ళాడడం విడ్డూరం కాదా? జయశీలుడు యువరాజని తెలియనప్పుడు ఇందుమతి అతణ్ణి ప్రేమించింది. తీరా అతడు యువరాజు అని తెలిసిన తరవాత, అతణ్ణి పెళ్ళాడాలనే కోరిక ఆమెకు కలగడం సహజమే. అలాంటప్పుడు, ఆమె తన తండ్రి సలహాను ఎందుకు పాటించలేదు? యువరాణి ఇద్దరు యువకులతో స్నేహంగా ఉన్నట్టు ఆమె జయశీలుడికి ఎందుకు చెప్పలేదు? జయశీలుడు ఇందుమతిని వివాహమాడాలని నిశ్చయించుకున్న తరవాత కూడా,

యువరాణి కోరిక గురించి తెలుసుకుని రమ్మని ఇందుమతిని పంపడంలోని ఆంతర్యం ఏమిటి? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "జయశీలుడు ఇందుమతిని వివాహమాడడంలో ఎలాంటి విడ్డూరమూ లేదు. ఎందుకంటే అతని తండ్రి, దయాస్వభావం గల గుణవంతు రాలిని పెళ్ళాడమని కోరాడు. ఆ సుగుణా లన్నీ ఇందుమతిలో ఉన్నవి. ఇక, ఇందు మతి చాలా ఉత్తమురాలు. జయశీలుడు యువరాజు అని తెలిసిన తరవాత, అతడు యువరాణిని పెళ్ళాడడమే ధర్మమని భావించింది. యువరాణి వైజయంతీదేవి, ఇద్దరు యువకులతో స్నేహంగా వుండ వచ్చు. ఆ కారణంగా ఆమె వాళ్ళను పెళ్ళాడడానికి నిశ్చయించుకున్నట్టు చెప్ప లేము. యువరాణికి ఎవరిపట్లా అటువంటి ఉద్దేశం లేదన్న విషయం, చెలికత్తె అయిన ఇందుమతికి తెలుసు. కావా లంటే, ఇందుమతి, ఆమె తండ్రి చెప్పిన విధంగా యువరాజుతో చెప్పి, యువరాణి పట్ల అతనికి విముఖత కలిగేలాచేసి, అతడు తనను పెళ్ళాడే అవకాశాన్ని పెంపొందించుకుని ఉండవచ్చు. అయితే, అది యువరాణిని మోసపుచ్చినట్టవు తుంది. ఇందుమతి చాలా నిజాయితీ పరురాలు కాబట్టి, ఆ పని చేయలేదు. ఇక ఆఖరి ప్రశ్న. యువరాజు అనుమతి మీదే అంగరక్షకులు అతడు ఎవరన్న విషయం, సత్రం యజమానికి తెలియజేసి వుండాలి. ఆ సంగతిని సత్రం యజమాని తన కూతురికి చెప్పగలడని జయశీలుడు ఊహించాడు. ఇందుమతి నిజాయితీని పరీక్షించడానికి అతడు దీనినొక అవకా శంగా ఉపయోగించుకున్నాడు. పరీక్షలో ఇందుమతి నెగ్గింది. కనుక, జయశీలుడు ఆమెను వివాహమాడాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# సమయస్ఫూర్తి

ఒక పల్లెలో అర్ధరాత్రివేళ అందరూ గాఢనిద్రలో వున్నారు. హఠాత్తుగా, "దొంగలు! దొంగలు!" అని కేకలు వినిపించాయి.

నిద్రలో వున్నవాళ్ళు ఉలిక్కిపడి లేచి కత్తులూ, కర్రలూ తీసుకుని వీధుల్లోకి వచ్చారు. అక్కడ వాళ్ళకు దుర్గయ్యా అనే యువకుడు కనిపించాడు.

"దొంగలెక్కడ?" అని వాళ్ళు దుర్గయ్యా నడిగారు.

దుర్గయ్యా దాపులనున్న మర్రిచెట్టు చూపించాడు. అందరూ మర్రిచెట్టు చుట్టూ చేరారు. వెన్నెల వెలుగులో వాళ్ళకు చెట్టు మీద, దొంగ లెవరూ కనిపించలేదు కాని, ఒక చిరుతపులి కనిపించింది.

దాన్ని చూస్తూనే జనంలో కొందరు, "ఈ మధ్య చీకటిపడి పొలం నుంచి తిరిగొస్తున్న యిద్దరిలో, ఒకణ్ణి చంపి, రెండోవాణ్ణి గాయపరిచిన పులి యిదే! దీన్ని ప్రాణాలతో వదల గూడదు," అన్నారు.

ఆ వెంటనే జనం అక్కడ చేతికందిన రాళ్ళతో, చిరుతపులిని కొట్టారు. అది చెట్టుపై నుంచి కిందికి దూకింది. వెంటనే నలుగురూ కలిసి దాన్ని కత్తులతో, కర్రలతో కొట్టి చంపేశారు.

ఇది జరిగాక. వాళ్ళు దుర్గయ్యాను, "ఏరా, దుర్గయ్యా! మనిషి మాంసం తినమరిగిన చిరుతపులి పల్లెలోకి వస్తే, దొంగలంటూ కేకపెట్టావెందుకు?" అని అడిగారు.

అందుకు దుర్గయ్యా నవ్వి, "దొంగలంటూ నేను కేక పెట్టగానే, మీరంతా ధైర్యంగా కత్తులూ, కర్రలూ తీసుకుని ఇళ్ళల్లోంచి బయటికి వచ్చారు. అదే నేను పులి, పులి అని కేక పెడితే, మీరు బయటికి వచ్చేవారా? ఎవరిళ్ళలో వాళ్ళు, తలుపులు మరికాస్త గట్టిగా బిగించు కుని కూర్చునేవాళ్ళు?" అన్నాడు.

జనం వాడి సమయస్ఫూర్తిని ఎంతగానో మెచ్చుకున్నారు. —వాణిశ్రీ



# చందమామ అనుబంధం—9

# మన విజ్ఞాన సంపద

## మహనీయులు:



### హరికృషన్

ఆయన ఒక అపూర్వమైన వ్యక్తి. ఎందుకంటే తన అయిదవయేటనే ఆయన శిక్కుమత గురువయ్యారు. హరిరాయ్‌గురు చిన్నకుమారుడైన హరికృషన్ 1656 వ సం॥ జూలై 7 వ తేదీన జన్మించాడు.

ఆ పసిప్రాయంలోనూ, ఆయన తన బాధ్యతలను గుర్తెరిగి నడుచుకున్నాడు. ఆయన ఎప్పుడూ ఎంతో ప్రశాంతంగానూ, హుందాగానూ వుండేవాడు. ఆయన గురించి మొగల్ రాజాస్థానానికి ఫిర్యాదు వెళ్ళింది. చక్రవర్తి ఆయన్ను పిలిపించాడు. అంబెర్ రాజా జెయ్ సింగ్, ఆయన్ను ఢిల్లీకి రమ్మని విన్నవించాడు. ఆయన ఢిల్లీకి విచ్చేసినప్పుడు ఉచిత గౌరవంతో స్వాగతం ఇచ్చారు. అయితే, అప్పుడే ఆయనకు మశూచి సోకింది. రోజురోజుకూ ఆరోగ్యం క్షీణించ సాగింది. చివరిఘడియలు ఆసన్నమయాయని తెలిసి, ఆయన అనుచరులు విచారవదనాలతో విలపించసాగారు. అయినా హరికృషన్, వారిని విలపించవద్దనీ, దేవుడి ప్రార్థనాగీతాలు ఆలపించమనీ, ఆదేశించాడు. 1664 వ సం॥ మార్చి 30 వ తేదీన ఎనిమిదేళ్ళు నిండకముందే ఆయన కాలధర్మం చెందాడు.

## ఎవరాయన?

ఒక ముని యజ్ఞం తలపెట్టాడు. యజ్ఞం పూర్తయిన తరవాత, ఆయన తనవద్ద వున్న సంపద నంతా, అతిథులకు దానం చేయసాగాడు. దాపులనే ఉన్న మునికుమారుడికి, తండ్రి తనను కూడా ఎవరికైనా దానంగా ఇచ్చి వేయగలడన్న భావం ఏర్పడింది. అందువల్ల అతడు, "నన్నెవరికి ఇస్తావు నాన్నా?" అని మాటిమాటికి అడగ సాగాడు. యజ్ఞకార్యంలో నిమగ్నుడై వున్న ముని, "నిన్ను యముడికిస్తాను," అన్నాడు చికాకుతో. మరుక్షణమే మునికుమారుడు యమలోకం చేరాడు. సమయానికి యముడు అక్కడ లేడు. మూడు రోజుల తరవాత, అక్కడికి వచ్చిన యమధర్మరాజు మునికుమారుడి, ఓర్పునూ పట్టుదలనూ సంతసించి, అతణ్ణి మూడు వరాలు కోరుకోమన్నాడు. "మరణరహస్యం తెలుసుకోవాలి! మరణానంతరం ఆత్మకు ఏమవుతుందో తెలుసుకోవాలి! ఇదే నా కోరిక," అన్నాడు ముని కుమారుడు.

యమధర్మరాజు మొదట కాస్త తటపటాయించినా, అతనికా రహస్యం తెలియజేశాడు!

ఈ కథలోని మునికుమారుడెవరో మీకు తెలుసా? (VIII పేజీ చూడండి)

## విజ్ఞాన వినోదం

# గాలిపై నిలబడుతుంది!

సూచనలు :

వ్యాక్యూమ్ క్లీనర్ మీది హూస్‌ను మరోవైపుకు తిప్పి, గాలి చిమ్మేవిధంగా నాసిల్‌పైకి ఉండేట్టు పట్టుకోండి (లేదా హెయిర్ డ్రైయర్ కూడా ఉపయోగించవచ్చు) యంత్రం నడిచి గాలి చిమ్మేప్పుడు, గాలిపై ఒక పింగ్-పాంగ్‌బంతిని నిలబెట్టండి. ఒకవేళ నిలబడకపోతే, మళ్ళీ మళ్ళీ ప్రయత్నించండి. తప్పకుండా బంతి గాలిపై నిలబడుతుంది।

### ఏం జరుగుతుంది? ఎలా జరుగుతుంది?

సరైన ఎత్తులో ఉంచినప్పుడు బంతి, వేగంగా తిరుగుతూ పడిపోకుండా గాలిపై నిలబడుతుంది. జాగ్రత్తగా పరిశీలించి చూసినట్టయితే—బంతి వేగంగా వస్తూన్న గాలిమధ్య ఉండడం తెలుస్తుంది. మధ్యలో గాలివేగం హెచ్చుగా వుంటుంది. అందువల్ల బంతికి ఒకవైపుకన్నా రెండవవైపు తక్కువ పీడనం ఏర్పడుతుంది. బంతికి వెలుపలవున్న అధిక పీడనం, దానిని వాయుప్రవాహకేంద్రానికి నెట్టుతుంది. కిందినుంచి చిమ్ముకువస్తూన్న గాలి పీడనం అధారంగా బంతి అలాగే నిలబడుతుంది. చుట్టూ తిరిగే వాయుపీడనంలోని మార్పువల్ల, బంతి తిరుగుతుంది.

అలా పింగ్-పాంగ్ బంతి ఒకచోట నిలకడగా నిలిచిన తరవాత, గాలి నింపిన ఆరంగుళాల వ్యాసం గల ఒక గుండ్రటి బెలూన్‌ను, బంతికి ఒక అడుగు ఎత్తున గాలి మధ్య ఉంచండి. బెలూన్ మరీ తేలికగా ఉన్నట్టయితే, దారం ముడి వేసిన చోట చిన్న కాగితం ముక్కను తగిలించండి. బెలూన్ కాస్త పెద్దదిగా ఉన్నట్టయితే, దానిని కిందికి లాగేవిధంగా చిన్న నాణెం తగిలించవచ్చు.

ఈ వ్యాక్యూమ్ క్లీనర్ గాలి ప్రవాహం మీద, ఇతర బంతులను నిలబెట్టడం సాధ్యమవుతుందా? ప్రయత్నించి చూడండి.



ప్రపంచపు అద్భుతాలు

# ఈస్టర్ ద్వీప విగ్రహాలు!

దక్షిణ పసిఫిక్ సముద్రంలో వున్న ఈస్టర్ ద్వీపంలో వరుసగా కొన్ని బ్రహ్మాండమైన విగ్రహాలు వున్నాయి. వీటి ఎత్తు 3 అడుగుల నుంచి 36 అడుగుల వరకు ఉంటుంది. వాటిలో ఒక విగ్రహం 66 అడుగుల ఎత్తు ఉన్నది. అవి 80 టన్నుల వరకు బరువున్నవి!

ఆ విగ్రహాలు అగ్నిపర్వత సమీపంలో ఉన్నాయి. అవి అక్కడికి ఎలా తీసుకురాబడినవి? వాటిని ఎవరు నిర్మించారు? ఎందుకు నిర్మించారు? ఎప్పుడు నిర్మించారు?—అనే విషయాలు ఇంకా గూఢంగానే ఉన్నవి. అధునిక శాస్త్రవేత్తలెవరూ వాటి రహస్యం తెలుసుకోలేకుండా వున్నారు!

PACIFIC OCEAN

EASTER ISLAND



# నూతనదేశ ఆవిర్భావం

బుద్ధుడికాలంలో తూర్పు భారతదేశానికి చెందిన విజయసింహు డనే ఒక యువరాజు, నూతన తీరాలు అన్వేషిస్తూ, ఏడువందలమంది అనుచరులతో సముద్రప్రయాణం ప్రారంభించాడు. కొన్నాళ్ళకు వాళ్ళొక ద్వీపం చేరుకున్నారు. ఆ ద్వీపం దట్టమైన అడవులతోనూ, కొండలతోనూ నిండి ఉన్నది. తమ పరిసరప్రాంతాలు తప్ప బయటిప్రపంచం గురించి ఏమాత్రం తెలియని కొందరు మనుషులు అక్కడ కనిపించారు. వాళ్ళను అరణ్యం మధ్యకు తరుమగొట్టి, విజయుడు రాజుగా నూతన రాజ్యం స్థాపించాడు.

ఆ తరవాత కొన్నాళ్ళకు అతని అనుచరులు కొందరు దక్షిణ భారత దేశంలోని మధురై చేరుకుని, పాండ్యరాజకుమార్తెను తమ రాజుకిచ్చి వివాహం చేయమని, మధురను పాలించే పాండ్యరాజును ప్రార్థించారు. అదేవిధంగా విజయసింహుడి అనుచరులు పెళ్ళాడడానికి ఏడువందలమంది కన్యలు కావాలని కూడా చెప్పారు. పాండ్యరాజు అందుకు అంగీకరించి, తన కుమార్తెతో పాటు ఏడువందలమంది కన్యలను ఆ ద్వీపానికి పంపాడు. విజయసింహుడితో పాటు, అతని అనుచరులందరికీ వివాహమయింది. విజయసింహుడి పేరు మీదుగానే, ఆ ద్వీపానికి 'సింహళం' అని నామకరణం చేశారు.

అశోకచక్రవర్తి కుమారుడు మహేంద్రుడు, సింహళద్వీపానికి వెళ్ళి, విజయసింహుడి వారసులకు బౌద్ధమత సిద్ధాంతాలను బోధించాడు. మహేంద్రుడి సోదరి సంఘమిత్ర, బుద్ధుడికి జ్ఞానోదయం కలిగిన గయలోని బోధి వృక్షం అంటుమొక్కను తీసుకువెళ్ళి, సింహళదేశంలో నాటింది. ఆ వృక్షం అనురాధపురంలో ఇంకా సజీవంగా ఉన్నది!

## గత చరిత్రకేసి చూద్దాం



1. నూతన మతాన్ని స్థాపించిన మొగల్ చక్రవర్తి ఎవరు?
2. ఆ మతం పేరేమిటి?
3. ఆ మాటకు అర్థం ఏమిటి?
4. అల్లా ఉద్దీన్ ఖిల్జీ చిత్తూర్ ముట్టడిని ఎదురొడ్డిన ఇద్దరు రాజపుత్ర వీరు లెవరు?
5. వారి రక్షణలో వుండిన రాణి ఎవ్వరు?
6. వారు ఏ రాజ్యానికి చెందినవారు?
7. పాండవులు నిర్మించిన నగరం పేరేమిటి?
8. అంతకు పూర్వం ఆ స్థలం పేరేమిటి?
9. కౌరవులు నివసించిన నగరం పేరేమిటి?
10. ఈ రెండు నగరాలు ఎక్కడ వుండేవి?

(VIII పేజీ చూడండి)

## మన లోకజ్ఞానం పరీక్షించుకుందాం

1. ఏసుక్రీస్తు మాట్లాడిన భాష ఏది?
2. ఉపాధ్యాయుడిగా తన జీవనోపాధిని సంపాదించిన రాజు ఎవరు?
3. యూకలిప్టస్ ఆకులే తిని బతికే ప్రాణి ఏది?
4. అన్నిటికన్నా పెద్ద గోరీ ఏది?
5. ఎనిమిది వారాల ప్రాయంలోనే తన మాతృభాషలో చక్కగా మాట్లాడిన వారెవరో తెలుసా?
6. కప్పలను భక్షించగల చెట్టు ఏది?
7. పట్టుపురుగు ఎంత పొడవు దారం నేయగలదు?
8. ప్రపంచంలోకెల్లా చాలా పెద్ద గంట ఎక్కడ ఉన్నది?
9. ఎక్కువకాలం జీవించే పక్షులు ఏవి?
10. సూర్యగోళ గర్భంలోని వేడి ఎంత?

(VIII పేజీ చూడండి)




1. మహాభారతాన్ని ప్రవచించిన వారెవ్వరు ?
2. దానిని ఆయన ఎక్కడ చెప్పాడు ?
3. ఏ సందర్భంలో వివరించాడు ?
4. ఆయన ఈ కథను ఎవరినుంచి విన్నాడు ?
5. ప్రస్తుతం వాడుకలో ఉన్న మహాభారతంలో మొత్తం ఎన్ని శ్లోకాలు ఉన్నాయి ?
6. ఆరంభంలో ఎన్ని శ్లోకాలు ఉండేవి ?
7. మహాభారత యుద్ధం ఎన్నిరోజులు జరిగింది ?
8. ప్రపంచంలోకెల్లా చాలా పెద్ద ఇతిహాసం ఏది ?
9. దానిని ప్రప్రథమంగా రాసినవారెవ్వరు ?
10. వ్యాసుడి పూర్తిపేరు ఏమిటి ?

(VIII పేజీ చూడండి)

## భారతీయ భాషలన్నిటిలోనూ ఒక మాట నేర్చుకుందాం

### ఈ నెల మాట: పడమర

| | | | | | |
|---|---|---|---|---|---|
| అస్సామీ | : పశ్చిమ్ | బెంగాలీ | : పశ్చిమ్ | ఇంగ్లిష్ | : వెస్ట్ |
| గుజరాతీ | : పశ్చిమ్ | హిందీ | : పశ్చిమ్ | కన్నడం | : పశ్చిమ |
| కాశ్మీరీ | : మ్యాగిబ్ | మలయాళం | : పడిజ్ఞారు | మరాఠీ | : పశ్చిమ్ |
| ఒరియా | : పశ్చిమ్ | పంజాబీ | : పచ్ఛమ్ | సంస్కృతం | : ప్రతీచి |
| సింధి | : అవులేహు | తమిళం | : మేర్కు | ఉర్దు | : మాగ్రిబ్ |

## మీరు నమ్ముతారా?

* అన్నిజాతుల కుక్కలూ మొరుగుతాయా?
* వెల్లుల్లి, నీరుల్లిపాయ జాతికి చెందినదా?
* గుర్రాలు ఈనాడున్నట్టే ఎప్పుడూ పెద్దవిగా ఉండేవా?

కావే కాదు!

- పశ్చిమ ఆఫ్రికాలోని కాంగో బుష్‌జాతి కుక్కలు మొరగలేవు.
- వెల్లుల్లిపాయలు కలువజాతికి చెందినవి.
- చారిత్రక పూర్వయుగంనాటి ఉత్తర అమెరికా గుర్రాలు కుక్కలంతేసే ఉండేవి!

## సమాధానాలు

### ఎవరాయన?

నచికేతుడు.

### చరిత్ర

1. అక్బరు
2. దిన్-ఇ-ఇల్లాహి
3. దైవ విశ్వాసం
4. గోరా, బాదల్
5. రాణి పద్మిని
6. మేవార్
7. ఇంద్రప్రస్థ
8. ఖాండవవనం
9. హస్తినాపురం
10. ఢిల్లీనగర సమీపంలో

### లోకజ్ఞానం

1. అరమాయిక్
2. లూయిస్ ఫిలిప్ (1778-1850) ఫ్రెంచి విప్లవ సమయంలో స్విట్జర్‌లాండ్‌కు పారిపోయి, మారుపేరుతో ఒక పాఠశాలలో లెక్కలమేష్టారుగా పని చేశాడు.
3. ఆస్ట్రేలియాకు చెందిన కోఆలా ఎలుగుబంటి
4. కెయిరో సమీపంలో వున్న ఖియోప్స్ పిరమిడ్.
5. జర్మనీలోని లూబెక్‌కు చెందిన క్రిస్టియన్ ఫ్రీడ్‌రిచ్ హెనికెన్.
6. కరోలినా సముద్రతీరంలోని వీనస్ ఫ్లై మొక్క. ఈ చెట్టు ఆకులలో చిక్కుకునే ఏ చిన్న ప్రాణీ ప్రాణాలతో తప్పించుకో జాలదు.
7. దాని శరీరం పొడవు మూడు అంగుళాల కన్నా తక్కువే. కాని, దానికన్నా పన్నెండువేలరెట్లు ఎక్కువ పొడవుగల దారం నేస్తుంది.
8. మాస్కోలోని క్రెమ్లిన్ సమీపంలో. దీని ఎత్తు 19 అడుగులు; బరువు 198 టన్నులు. అయినా ఇదెప్పుడూ వేలాడగట్టి మోగించబడలేదు.
9. తేగలు. కొన్ని 150 సంవత్సరాల వరకూ జీవిస్తాయి.
10. 40,000,000 డిగ్రీలు ఫారెన్‌హీట్.

### సాహిత్యం

1. సూతముని.
2. నైమిశారణ్యంలోని శౌనక ముని ఆశ్రమంలో.
3. శౌనకుడు చేసిన యజ్ఞానంతరం.
4. వైశంపాయనముని నుంచి.
5. ఒక లక్ష శ్లోకాలు.
6. ఇరవైనాలుగువేల శ్లోకాలు.
7. పద్ధెనిమిది రోజులు.
8. మహాభారతం. హోమర్ రచించిన ఇలియడ్, ఒడిస్సీ రెండిటినీ కలిపినా అంతకన్నా ఎనిమిది రెట్లు పెద్దది.
9. విఘ్నేశ్వరుడు—వ్యాసుడు చెబుతూ వుంటే.
10. కృష్ణ ద్వైపాయన వ్యాసుడు.



# నెహ్రూకథ—7

జవహర్‌లాల్ ఆఖరికి నాభా ప్రభుత్వం చేత విడుదల చేయబడ్డాడు. అయినా, ఆయనకు అప్పుడే టైఫాయిడ్ జ్వరం పట్టుకున్నది. అలా మంచం పట్టినా, కొంతకాలం అన్నిటికీ దూరంగా ప్రశాంతంగా గడిపే అనుభవం ఆయనకు ఏర్పడింది.

1923వ సంవత్సరం కాకినాడలో జరిగిన కాంగ్రెస్ మహాసభకు—ముస్లిం జాతీయ నాయకుడు ఎం. మహమ్మదాలీ అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. ఆయన పట్టుదల కారణంగా జవహర్‌లాల్ కాంగ్రెస్ కార్యదర్శి అయ్యాడు.





ఇది జరిగిన తరవాత ఆయనకు మరొక కొత్త అనుభవం ఎదురయింది. అలహాబాదు సమీపంలో గంగ, యమున, సరస్వతీ నదులు కలిసే త్రివేణీ సంగమంలో కుంభమేళా ఉత్సవం జరగనున్న సమయం. ఆ ఉత్సవం చాలా గొప్పగా జరగడం సంప్రదాయం.



అయితే, త్రివేణీ సంగమంలో స్నానం చేయడం క్షేమకరంకాదని, అనాటి ప్రభుత్వం, దానిని నిషేధించింది. గట్టి పోలీసు కాపలా ఏర్పాటుచేయబడింది. ప్రజలెవరూ నీళ్ళలోకి దిగకుండా ఎత్తయిన కంచె వేయబడింది.

సుప్రసిద్ధ నాయకుడు పండిత మదన మోహన మాలవ్యా, ప్రభుత్వ చర్యను వ్యతిరేకించాడు. కంచెను అనుకుని వున్న ఇసుక మీద తన అనుచరులతో శాంతియుతంగా సత్యాగ్రహం ప్రారంభించాడు. మేళాను చూడడానికి వెళ్ళిన జవహర్‌లాల్ కూడా సత్యాగ్రహంలో పాల్గొన్నాడు.





గంటలు గడిచాయి. సూర్యుడు నడి నెత్తిమీదికి వచ్చాడు. ఇసుక మండి పోతున్నది. మధ్యాన్నానికి తుదవాత జవహర్‌లాల్ ఓర్పు కోల్పోయి, హఠాత్తుగా కంచె మీదికి ఎక్కి కాంగ్రెస్ జెండా పట్టుకుని కూర్చున్నాడు.

ఈ దృశ్యం చూసిన వందలాది మంది అమితోత్సాహంతో కంచె మీదికి ఎక్కారు. కంచె విరిగిపడింది. ప్రజలు నదిలోకి దూకారు. నెహ్రూ కూడా నీళ్ళలోకి దూకాడు. చివరకు మాలవ్యా సైతం నదిలోకి దిగాడు!





అహమ్మదాబాదులో జరిగిన కాంగ్రెస్ కమిటీ సభలో గాంధీజీ—నూలు వడక గలిగిన వారికి మాత్రమే కాంగ్రెస్ సభ్యత్వం ఇవ్వాలని ఒక తీర్మానం ప్రతిపాదించాడు. మోతీలాల్ నెహ్రూ, దేశబంధు చిత్తరంజన్‌దాస్ ఈ ప్రతిపాదనను వ్యతిరేకించి సభను బహిష్కరించారు. గాంధీజీ తన ప్రతిపాదనను ఉపసంహరించుకున్నాడు.

1924 సం॥ బెల్గామ్‌లో జరిగిన కాంగ్రెస్ మహాసభకు గాంధీజీ అధ్యక్షత వహించాడు. ఆయన అభీష్టానుసారం జవహర్‌లాల్ మరొకసారి కార్యదర్శి అయ్యాడు. జవహర్‌లాల్ పట్ల కాంగ్రెస్‌వాదులందరూ అచంచల విశ్వాసం పెంచుకున్నారన్న విషయం గాంధీజీ గ్రహించాడు.





1925 వేసవిలో మోతిలాల్‌కు సుస్తీ చేసింది. ఆయన కుటుంబ సమేతంగా హిమాలయ ప్రాంతాలకు వెళ్ళాడు. జవహర్‌లాల్ కూడా అక్కడికి చేరాడు. చాంబాలో ఉన్నప్పుడే దేశబంధు చిత్తరంజన్‌దాస్ కీర్తిశేషుడయ్యాడన్న వార్త అందింది. తండ్రికొడుకు లిరువురూ కలకత్తాకు బయలుదేరారు.

1924లో అలహాబాదులో మత కలహాలు చెలరేగాయి. అది జవహర్‌లాల్‌కు ఎంతో విచారం కలిగించింది. తమ ప్రార్థనా స్థలాలైన మసీదుల సమీపంలో హిందువులు ఊరేగింపు జరపడం మహమ్మదీయులకు ఆగ్రహం కలిగించింది. అయినా, ఊరేగింపులు జరపడం హిందూమతంలో ప్రధాన అంశంగా ఉంటున్నది.





హిందువులు దీనికి తమ వ్యతిరేకత తెలియజేయాలని అతి ప్రాచీనమైన 'రామలీల' ఊరేగింపు కూడా ఆపు చేశారు. తను బాల్యంలో ఉత్సాహంతో పాల్గొన్న రామలీల ఉత్సవాలు జవహర్‌లాల్‌కు జ్ఞాపకం వచ్చాయి. పరస్పర అవగాహన లోపించి, చిన్న చిన్న సర్దుబాట్లు లేకపోవడంవల్లనే ఇలా జరుగుతున్నదని గ్రహించి ఆయనెంతో విచారం చెందాడు. —(ఇంకావుంది)



# రెండు అద్భుతాలు!

ఏథెన్స్‌నగర సమీపంలో ఒక ధనికుడుండే వాడు. ఆయన పేదసాదలపట్ల ఎంతో కరుణ చూపుతూ, గొప్ప ధర్మదాతగా పేరు గాంచాడు.

ఆయన పరోపకారబుద్ధిని గురించి, పొరుగుప్రాంతానికి చెందిన సోమరిపోతు ఒకడు విన్నాడు. ఎలాగైనా ధర్మదాత నుంచి లాభం సాధించాలని వాడొక పథకం వేశాడు.

ఆ సోమరి ఒకనాటి ఉదయం, తన కాలికి గట్టిజిగురు పట్టించుకుని కుంటుతూ వెళ్ళి, సంపన్నుడి భవనం ముందు కూర్చున్నాడు. యజమాని ఇంటి నుంచి బయటకు రావడం చూసి, వాడు ఎంతో బాధతో మూల్గుతూ లేచి నిలబడ్డాడు.

''ఏమయింది ? ఎందుకలా బాధపడుతున్నావు ?'' అని అడిగాడు ధనవంతుడు ఎంతో ప్రేమతో.

వాడు మాట్లాడలేదు. కాస్త వాచినట్టు కనిపిస్తున్న తన కాలు చూపించి, బొటబొటా కన్నీళ్ళు కార్చాడు.

ధనవంతుడు తన సేవకుణ్ణి పిలిచి, అతణ్ణి ఇంట్లోకి తీసుకు వెళ్ళి పడకపై పడుకోబెట్టమని చెప్పి, ''నువ్వేమీ బాధపడకు. నీ కాలిబాధను పోగొట్టే బాధ్యత నాది,'' అన్నాడు.

సోమరి, సేవకుడి చేయి పట్టుకుని నెమ్మదిగా ఇంట్లోకి వెళ్ళి పడక మీద కూర్చున్నాడు.

తరవాత ధనికుడు వైద్యుడి కోసం మనిషిని పంపాడు. వారం రోజులకిందటే, ధనికుడి ఇంటిపక్కన, వైద్యుడినని చెప్పుకుంటూ శిష్యుడితోపాటు ఒకడు కొత్తగా వచ్చి చేరాడు. సేవకుడు వెళ్ళి వైద్యుణ్ణీ, అతని శిష్యుణ్ణీ వెంటబెట్టుకుని వచ్చాడు. వైద్యుడు వచ్చీ రాగానే రోగిని

గ్రీకు జానపద కథ



రకరకాలుగా పరీక్షచేశాడు. వాడికి ఎటువంటి రోగమూ లేదనీ, బాధపడుతున్నట్టు కావాలనే వాడు నటిస్తున్నాడనీ వైద్యుడు పసికట్టాడు. అయినా ఆ విషయం బయట పెట్టకుండా, వైద్యుడు తన శిష్యుడితో, ''ఇది మన మనుకున్నంత తేలికగా నయమయ్యే వ్యాధికాదు. శస్త్రచికిత్సతో కాలి ఎముకను తొలగించడం తప్ప మరొక మార్గం కనిపించడం లేదు,'' అన్నాడు.

''అవును, అలాగే చేద్దాం. ఇదుగో కత్తి,'' అంటూ పెద్ద కత్తిని వైద్యుడి చేతికి అందించబోయాడు శిష్యుడు.

''అంత పని చేయకండి బాబూ, మీకు పుణ్యముంటుంది! నా వ్యాధి అంత భయంకరమైనదేమీ కాదు,'' అన్నాడు సోమరి భయపడిపోతూ.

వైద్యుడు చిన్నగా నవ్వి, ''అలాగా! నీకు వచ్చిన వ్యాధి అంత భయంకరమైనదేమీకాదు, నిజమే. ఆ విషయం మాకూ తెలుసు. కాని, ధర్మదాత అయిన ఈ శ్రీమంతుణ్ణి మోసగించాలనుకున్న నీ బుద్ధి చాలా భయంకరమైనది!'' అన్నాడు.

''బాబూ, నన్ను క్షమించండి,'' అన్నాడు వాడు.

''అలా అయితే మన మధ్య ఒక ఒప్పందానికి వద్దాం. ధనికుడి ఇంట సకల సుఖాలూ అనుభవించాలనే ఆశ నీకున్నది. ఆ ఆశ మేము నెరవేరుస్తాం. ఔషధసేవతోపాటు, నీకు మంచి భోజనం కావాలని ఇంటి యజమానితో చెబుతాం. అందుకు ప్రతిఫలంగా మేము ఆయన దగ్గర పైకం పుచ్చుకుంటాము. నువు మాతో సహకరించాలి. సరేనా?'' అన్నాడు వైద్యుడు.

''నిక్షేపంలాంటి యోచన!'' అన్నాడు సోమరి అమితానందంతో.

వైద్యుడు ధనికుడి దగ్గరికి వెళ్ళి, "అతణ్ణి భయంకరమైనవ్యాధిపీడిస్తున్నది. నయం చేయడానికి మా శాయశక్తులా కృషి చేస్తాము. మేమిచ్చే ఔషధంతోపాటు అతనికి మంచి భోజనం కూడా ఏర్పాటు

చేయండి.'' అని చెప్పి, తమకు చేరవలసిన పైకం తీసుకుని సంతోషంగా వెళ్ళిపోయాడు.

వైద్యుడి సలహా ప్రకారం, ధనవంతుడు రోగికి మూడుపూటలా మంచి భోజనం, విశ్రాంతి సౌకర్యం ఏర్పాటు చేశాడు. వైద్యుడు క్రమం తప్పకుండా రోజూ వచ్చి, వాణ్ణి పరీక్షించి ధనవంతుడి వద్ద పైకం పుచ్చుకుని వెళ్ళసాగాడు.

ఇలా కొన్నాళ్ళు గడిచాయి. ఒకనాడు ధనికుడు వైద్యుణ్ణి, ''చికిత్స ఇంకా ఎన్నాళ్ళు జరగాలి? వ్యాధి ఏమైనా తగ్గుముఖం పట్టిందా లేదా?'' అని అడిగాడు.

''మేమెంతో జాగ్రత్తగా చికిత్స జరుపుతున్నాము. కాని, ఎందువల్లనో వ్యాధి మాత్రం తగ్గడం లేదు.'' అన్నాడు వైద్యుడు ఎంతో గంభీరంగా.

మరునాడు సాయంకాలం యథాప్రకారం రోగిని పరీక్షించడానికి వచ్చిన వైద్యుడితో ధనికుడు, ''ఇంకా ఎన్నాళ్ళీ చికిత్స? చికిత్సావిధానం మార్చండి. లేదా రోగిని నగరంలోని వైద్యుడి వద్దకు పంపుతాను.'' అని చెప్పి వెళ్ళిపోయాడు.

వైద్యుడు, ఆ మాటలకు హడలిపోయి, తన శిష్యుడితో, ''వీణ్ణి నగరంలోని వైద్యుడి దగ్గరికి తీసుకువెళ్ళారంటే మన గుట్టు బయటపడిపోతుంది. కాలిపై కనీసం మచ్చ కూడా లేకుండా, వ్యాధి పూర్తిగా నయమైపోయిందంటే ఎవరు మాత్రం నమ్మగలరు?'' అన్నాడు.



''మనం అలా చెప్పినప్పటికీ, వాణ్ణి పరీక్షచేస్తే ఏ వ్యాధీ లేదని తేలిపోతుంది. అందువల్ల, వాడి కాలు తొలగించడం ఒక్కటే తరుణోపాయం,'' అన్నాడు శిష్యుడు.

''అద్భుతమైన సలహా. రోగికి మత్తు మందిచ్చి ఆ పని ఇప్పుడే చేసేద్దాం. వెళ్ళి వెంటనే మత్తుమందు పట్టుకురా,'' అన్నాడు వైద్యుడు.

చాటుగా వుండి వాళ్ళ సంభాషణ విన్న రోగికి ప్రాణం పోయినంత పన యింది. వాళ్ళు మత్తుమందు తేవడానికి వెళ్ళిన సమయం చూసి, పక్క మీది నుంచి ఒక్కగెంతున కిందికి దూకి పరుగు పట్టాడు. తనను చూసి ఎవడో దొంగ పారి పోతున్నాడని, ధనికుడు వాడి వెంటబడి తరిమిపట్టుకుని, ''ఏమిటిదంతా ? నీ కాలి బాధ ఏమయింది ?'' అని అడిగాడు ఆశ్చర్యంగా.

''చిటికలో వ్యాధి నయమైపోయింది! బహుశా ఏదో అద్భుతశక్తివల్ల అలా జరిగి వుంటుంది. ఈ విషయం వైద్యుడికి చెప్పి రావడానికే వెళుతున్నాను,'' అంటూ వాడు గబగబా వైద్యుడు బస చేసిన చోటికి వెళ్ళాడు.

అయితే, దూరం నుంచి తమ రోగి చేసిన సాహసం చూసిన వైద్యుడు, శిష్యుడితోసహా గుట్టుచప్పుడు కాకుండా చల్లగా జారుకున్నాడు.

వెనకనే వచ్చిన ధనికుడు జరిగిన సంగతంతా గ్రహించి, చిన్నగా నవ్వుతూ, ''ఒకటికాదు; రెండు అద్భుతాలు జరిగాయి. నీ రోగమే కాదు; నీకు చికిత్స చేసిన వైద్యుడు కూడా శిష్యుడితో సహా ఒక్క క్షణంలో మాయమై పోయాడు,'' అన్నాడు వాడితో.

తన మోసం బయటపడిందని గ్రహించి వాడు సిగ్గుతో తల దించుకున్నాడు.

ధనికుడు వాణ్ణి క్షమించి, తన ఉద్యాన వనంలో వాడికి తోటమాలిపని అప్పగించి, శ్రమించి నిజాయితీగా జీవించడానికి దారి చూపాడు.





# కృష్ణావతారం

ద్వారక పైకి దండెత్తి వెళ్ళే సన్నాహంలో ఉండగా పౌండ్ర వాసుదేవుడి ఇంటికి నారదుడు వచ్చాడు. పౌండ్రుడు నారదుడికి ఎదురు వెళ్ళి, అర్ఘ్యపాద్యాలిచ్చి, బంగారు ఆసనం మీద కూర్చోబెట్టి, "మహానుభావా, నువ్వు తిరగని లోకం లేదు. ఎక్కడికి పోయినా నిన్నెవరూ అడ్డగించరు. అందుచేత నా కొక సహాయం చెయ్యి. నేను కృష్ణుణ్ణీ, అతని బలగాన్నీ సర్వనాశనం చెయ్యబోతున్నానని అన్ని లోకాలలోనూ చెప్పు. అ గోపకుడు నా పేరు పెట్టుకుని తిరుగుతున్నాడు," అన్నాడు.

ఈ మాటకు నారదుడు చిరునవ్వు నవ్వి, "నేను సమస్త లోకాలూ తిరిగే మాటా నిజమే, నా మాట అందరూ నమ్మేదీ నిజమే. కాని నువు చెప్పే మాట అనుమానాస్పదంగా ఉన్నది. కృష్ణుడికీ, నీకూ పోలికేమిటి? కొండ ముందు నలుసులాటివాడివి. నువు కృష్ణుడికి ప్రతియోధుడి వెలా అవుతావు? నిన్ను కృష్ణుడు తప్పక శిక్షిస్తాడు. అందుచేత ఈ ప్రయత్నం మానుకో. నీ పేరూ వాసుదేవుడే గదా అనీ, నీకు కూడా శంఖ చక్ర గదా శార్ఙ్గా లున్నాయని కృష్ణుడితో సమానుడివి కాబోవు. నవ్వులపాలై పోగలవు. నీ మదం అణచటానికి అతను కూడా ఎదురు చూస్తూనే ఉంటాడు," అన్నాడు.

పౌండ్రుడు బిగ్గరగా నవ్వి, "నువ్వన్నది కాదంటే కోప్పడతావు, శపిస్తావు. అందుచేత ఏమన్నా అనాలంటే మా బోటి



వాళ్ళం భయపడతాం. ఈ మాటలే మరొకడంటే బతకనిచ్చేవాణ్ణా? నీతో వాగ్వాదానికి నాకు తీరిక లేదు. నీ నోటితోనే నన్ను మెచ్చుకునే రోజు వస్తుందిలే. ఇంక దయచెయ్యి.'' అని చెప్పాడు.

నారదుడు పౌండ్రుడితో ఏమీ అనక తిన్నగా బదరికాశ్రమానికి వెళ్ళి, అక్కడ ఉన్న కృష్ణుడితో పౌండ్రుడి యుద్ధ సన్నాహం గురించి చెప్పి తన దారిన తాను వెళ్ళిపోయాడు.

ఆ రాత్రే పౌండ్రుడు ప్రచండమైన సేనతో బయలుదేరి ద్వారకను ముట్టడించబోయాడు. కొన్నివేల దివిటీలతో అతని సేన ద్వారకయొక్క తూర్పు ద్వారం వద్ద చేరింది. వాళ్ళు ఆ అపరాత్రివేళ దిక్కులు బద్దలయేలాగా భేరీలూ, కాహళులూ మోగించారు.

యాదవులు తగు జాగ్రత్తలోనే ఉన్నారు. రాత్రివేళల కూడా ద్వారకా నగరం దివిటీలతో పగటివేళ ఉన్నంత ప్రకాశవంతంగానూ ఉంటున్నది. పౌండ్రుడి రాకకు ఏ మాత్రమూ కంగారు పడక, యాదవులు అతి శీఘ్రంగా తమ సేనలను యుద్ధానికి అయత్తపరిచారు. తరవాత ఉగ్రసేనుడూ, బలరాముడూ, సాత్యకీ, కృతవర్మా ముందుండి, సైన్యాల్ని వెంటబెట్టుకుని వచ్చి పౌండ్రుడి సేనలతో మహాదారుణమైన యుద్ధం ప్రారంభించారు. ఉభయపక్షాలా ఏనుగులూ, గుర్రాలూ, రథాలూ నాశనం కాసాగాయి.

ఒక వంక సంకుల సమరం సాగుతూంటే పౌండ్రుడి పక్షానికి చెందిన ఏకలవ్యుడనే వాడు తన పేరు చెప్పుకుని సాత్యకినీ, కృతవర్మనూ, బలరాముణ్ణీ, కృష్ణుణ్ణీ పేర్లు పెట్టి పిలిచి యుద్ధానికి సవాలు చేశాడు. యాదవవీరులు అతనికి ఎదురు రాగా అందరినీ బాణాలతో కొట్టాడు. దివిటీలవాళ్ళు దివిటీలు పారేసి పారిపోయారు. యుద్ధ రంగం అంతా చీకటి అయింది. పౌండ్రుడు తాను గెలిచాననే అనుకున్నాడు. ''కోట గోడలు

ఎక్కండి, ధ్వజాలు విరగ గొట్టండి, నగరం ఆక్రమించండి!'' అని పౌండ్రుడు కేకలు పెడుతూంటే అతని సేనలో ఉత్సాహమూ, కోలాహలమూ జాస్తి అయాయి.

ఈ పరిస్థితి చూసి సాత్యకికి మండి పోయింది. కృష్ణుడు నగర రక్షణ భారం తన మీద పెట్టి వెళ్ళాడు. కృష్ణుడు లేని కారణం చేతనే శత్రువులింతగా విజృంభించారనే మాట వస్తుంది. అందుచేత అతను తన పక్షానికి చెందిన యోధులను ఉత్తేజపరుస్తూ, ''నేనీ శత్రువులను ఎలా నిర్మూలించబోతున్నానో చూడండి. నగరం రక్షించే భారం మన అందరి పైన ఉన్నదన్న సంగతి మరిచారా?'' అన్నాడు.

ఇలా అంటూనే సాత్యకి ఆగ్నేయాస్త్రం ప్రయోగించాడు. దానితో కోట నాలుగు పక్కలా మంటలు పుట్టుకొచ్చాయి. కోట గోడలు ఎగబాకే ప్రయత్నంలో ఉన్న సైనికులు పారిపోయారు. సాత్యకి వారిని తరుముకుంటూ వెళ్ళి, ''రాజై పుట్టి, రాచమర్యాద కూడా తెలియకుండా, అర్ధ రాత్రివేళ అందరూ నిద్రపోయే సమయంలో దొంగలాగా యుద్ధానికి వచ్చిన ఆ నీచు డెక్కడ? నేను అతనితో యుద్ధానికి వచ్చాను,'' అని కేక పెట్టాడు.

ఈ కేక విని యుద్ధసన్నద్ధుడై ఉన్న పౌండ్రుడు ముందరికి వచ్చి, ''ఓయీ, సాత్యకీ, నువు యుద్ధానికి వచ్చావు, బాగానే ఉన్నది. కాని ఆ కృష్ణు డెక్కడ?





అతగాడు అవులను తోలుకోక పెద్ద యోధుడనని తిరుగుతున్నా డేమిటి? నా సంగతి ఎరగడా? స్త్రీలనూ, గొడ్లనూ సంహరించే వాడు నా పేరు తగిలించుకుంటే ఏమైనా నప్పుతుందా? ఆ కృష్ణుడు నా మిత్రుడు నరకుణ్ణి చంపాడు. అందుచేత అతన్ని యుద్ధంలో కడతేర్చ వచ్చాను. నీతో యుద్ధం చెయ్యటం నాకు పరువు చేటు. అందుచేత నువు తప్పుకో. కాదంటావా? ఒక్క క్షణంలో నా బాణాలతో నిన్ను పరలోకానికి పంపగలను, చూసుకో! దాంతో మీ గోపాలుడి మదం అణిగి పోతుంది. అతను ఈ పల్లె భారమంతా నీ నెత్తిన పెట్టి కైలాస యాత్ర వెళ్ళాడని తెలుస్తున్నది. వచ్చాక అతని సంగతి చూస్తాం. ప్రస్తుతానికి అతనికి సంతోషం కలిగేటట్టుగా చావటమే నీ ధర్మం,'' అన్నాడు.

ఇద్దరూ ఇదే ధోరణిలో బీరాలు పలికి యుద్ధానికి దిగారు. ఇద్దరూ బాణాలతో పరస్పరం క్రూరంగా హింసించుకున్నారు; ఒకరి నొకరు మూర్ఛ పోగొట్టారు; ఒకరి రథా లొకరు ధ్వంసం చేశారు; ఒకరి బాణా లొకరు విరగగొట్టారు; ఇద్దరూ గదాయుద్ధం చేశారు; చివరకు ముష్టి యుద్ధం కూడా చేశారు. ఇద్దరూ సమ బలులుగా కనిపించారు. చస్తే ఇద్దరూ చస్తారుగాని, ఒకరిని మరొకరు చంపి, గెలవటం సాధ్యం కాదని చూసే వారికి అనిపించింది. చివరకు ఉభయపక్షాల యోధులూ వారి యుద్ధానికి అడ్డం తగిలి, వారిని విడదీశారు.

తరవాత ఏకలవ్యుడూ, బలరాముడూ ద్వంద్వ యుద్ధం చేశారు. ఆ యుద్ధంలో బలరాముడు ఏకలవ్యుణ్ణి మూర్ఛపోగొట్టి, తన హలాయుధంతో శత్రుసైన్యాన్ని చించి చెండాడాడు.

ఇంతలో స్పృహ తెలిసి, ఏకలవ్యుడు తిరిగి బలరాముడి పైన కలియబడ్డాడు. వారు భయంకరంగా యుద్ధం చేస్తూండగానే తూర్పు తెల్లవారింది.

అప్పుడు పౌండ్రుడు తన సేనలను యుద్ధం నిలపమని హెచ్చరిస్తూ, "మనం ఎంతమందిని చంపి ఏమి లాభం? అసలు శత్రువు లేడు. అందుచేత ఈ యుద్ధం నిరర్థకం. కృష్ణుడు వచ్చాక మన పరాక్రమం చూపుదాం. ఈ క్షుద్రుల మీద ప్రతాపం చూపేదేమిటి?" అన్నాడు.

వెంటనే పౌండ్రుడి సేనలు యుద్ధం మాని వెనక్కు తగ్గాయి. పౌండ్రుడు తన సేనలను వెంటబెట్టుకుని, తన మిత్రుడైన కాశీరాజు వద్దకు వెళ్ళిపోయాడు. కృష్ణుడి రాకకు ఎదురుచూస్తూ అతను అక్కడే ఉండిపోయాడు.

ద్వారకలో యాదవులు తమకు విజయం లభించిందన్నట్టు తూర్యనాదాలు చేసి, నగరం లోపలికి వెళ్ళిపోయారు. కృష్ణుడి మాట నిలబెట్ట గలిగినందుకు వారు చాలా సంతోషించారు.

ఇంతలో కృష్ణుడు ఆకాశమార్గాన వారికి కనిపించాడు. అతను నగరం బయట గరుడవాహనం దిగి, దారుకుడు తెచ్చిన రథమెక్కి, ద్వారకలోకి వచ్చాడు. పన్నెండేళ్ళ అనంతరం కనిపించిన కృష్ణుణ్ణి చూసి యాదవు లెంతో సంతోషించారు. కృష్ణుడు బంధుమిత్రులకు తన కైలాసయాత్ర వివరాలన్నీ చెప్పి, వాళ్ళ నుంచి పౌండ్రుడు చేసి వెళ్ళిన ఘోర యుద్ధం గురించి విన్నాడు.

కృష్ణుడు ద్వారకకు తిరిగి వచ్చాడని తెలిసి, కాశీలో ఉన్న పౌండ్రుడు ఒక





దూత ద్వారా ద్వారకలో వున్న కృష్ణుడికి ఇలా సందేశం పంపాడు:

''గోవుల మధ్య పుట్టి పెరిగిన నీకు ధర్మం తెలీదు. స్త్రీలనూ, మృగాలనూ, బంధువులనూ వధించటంతో ఊరుకోక, నా పేరూ, నా చిహ్నాలూ కూడా ధరించావు. ఏ విధంగానూ నువు నన్ను పోలవు. నీకు బతికి ఉండాలన్న కోరిక ఉంటే, నా ఆజ్ఞప్రకారం చక్రం మొనలైన ఆయుధాలు విసర్జించు; నా పేరు పెట్టుకోవటం మాని, వెంటనే వచ్చి నన్ను శరణువేడు.''

పౌండ్రుడి మాటలుగా దూత ఇలా చెప్పగా కృష్ణుడు నవ్వి, ''మీ రాజు చెప్పినట్టే చేస్తాను. నన్ను రమ్మన్నాడు గనక వస్తాను; చక్రం మొదలైనవి విడవమన్నాడు గనక అతని మీదనే విడుస్తాను. తన శరణం వేడమన్నాడు గనక, అతని శరణం (వధ) చూస్తాను. గొప్పవాడి మాట తీసివెయ్యటం బాగుండదు,'' అని దూతను ఉచిత మర్యాదలతో గొప్పగా సత్కరించి పంపేశాడు.

తన దూత తెచ్చిన సందేశం వినగానే పౌండ్రుడు కాశీనగరం వెలపల తన తోటి రాజులతోనూ, సైన్యాలతోనూ సన్నద్ధుడై కృష్ణుడి రాకకోసం ఎదురు చూడసాగాడు.

కృష్ణుడు బయలుదేరుతూంటే, సాత్యకి మొదలైన వాళ్ళు కూడా సైన్యాలతో బయలుదేరబోయారు. కాని కృష్ణుడు వారిని వారించి, ''యుద్ధంలో మీ వంతు గెలుపు మీరు పొందారు. ఈసారి నా వంతు,'' అని చెప్పాడు.

అతను గరుడవాహనం మీద బయలుదేరి పౌండ్రుడున్న చోటికి చేరాడు. ఇద్దరు వాసుదేవులూ ఒకరి కొకరు ఎదురు నిల్చారు. కృష్ణుడు పౌండ్రుడితో, ''పౌండ్ర రాజా, నీకు నా లాంఛనాలన్నిటినీ ధరించాలని కోరిక ఉన్నట్టయితే నన్ను వేడుకుంటే నేను సమ్మతించకపోయానా? ఎందు కింత మతిమాలిన పని చేశావు? ఇప్పుడైనా మించిపోలేదు, నన్ను వేడు

కుంటే నేను నిన్ను కాస్తాను. నేను శరణాగత త్రాణపరాయణుణ్ణి. నా చక్రంతో నరకుడి లాగా ఎందరో చచ్చారు. ఇక్కడ ఉన్న వారిలో ఒక్కడూ నిన్ను రక్షించలేడు. నీ మేలు కోరి హితం చెప్పాను,'' అన్నాడు.

''నా లాంఛనాలనే నువు పెట్టుకున్నావు. అందుకు నిన్ను శిక్షించటానికే నేను వచ్చాను. నా రాక తెలిసి కొంత కాలం కైలాసంలో దాక్కున్నావు. నువు లేవని తెలిసి నీ నగరాన్ని నేలమట్టం చెయ్యక వదిలాను. నువు రావటం మంచిదయింది. నీకోసం యముడు కాచుకుని ఉన్నాడు,'' అన్నాడు పౌండ్రుడు.

ఇద్దరూ యుద్ధానికి ఉపక్రమించారు. కృష్ణుడు వరసగా పౌండ్రుడి ఆయుధాలన్నీ నిర్మూలించి, తన చక్రాయుధంతో పౌండ్రుణ్ణి కడతేర్చాడు.

తన ఆప్తమిత్రుడైన పౌండ్రుడు చచ్చాడన్న రోషంతో కాశీరాజు కృష్ణుడితో యుద్ధానికి తలపడ్డాడు. కృష్ణుడు ఒక అస్త్రంతో కాశీరాజు తల తెగనరికాడు. ఆ తల వెళ్ళి కాశీనగరం మధ్యన పడింది.

ఈ విధంగా కృష్ణుడు తాను వచ్చిన పని విజయవంతంగా ముగించి ద్వారకకు తిరిగి వెళ్ళాడు.

కాశీరాజు కొడుకు తన తండ్రి చావుకు దుఃఖించి, తమ పురోహితుడి చేత అగ్నిహోత్రం చేయించగా దక్షిణాగ్నియందు కృత్య అనే భయంకర పిశాచి ఆవిర్భవించి, ''ఏమి ఆజ్ఞ?'' అని అడిగింది. కృష్ణుణ్ణీ, అతని వాళ్ళనూ చంపి రమ్మని కాశీరాజు కొడుకు దాన్ని కోరాడు. కృత్య ద్వారకకు వచ్చింది. ద్వారకావాసులు దాన్ని చూసి భయపడి కృష్ణుడితో చెప్పారు. కృష్ణుడు తన సుదర్శనచక్రాన్ని దాని మీదికి వదిలాడు. కృత్య తిరిగి కాశీకి పారిపోతుంటే చక్రం దాన్ని వెన్నంటి వెళ్ళింది. కృత్య కాశీనగరంలో ప్రవేశించగానే సుదర్శనచక్రం కృత్యతోబాటు కాశీనగరాన్ని కూడా నిర్మూలించేసింది.






# పారని యుక్తి

ఒక ఊళ్ళో ఒక ధనికుడుండేవాడు. ధనవంతుడైనందుకు ఆయన దానధర్మాలు విరివిగా చేసి, గొప్ప దాత అన్న కీర్తి సంపాదించుకున్నాడు.

పొరుగూళ్ళో ఇంకొక ధనికుడుండేవాడు. అయితే ఆయన పరమ లోభి, కాకికి కూడా ఎంగిలిచెయ్యి విదిలించేవాడు కాడు. అందుచేత, దాతను మెచ్చుకున్న నోటితోనే జనం లోభిని పడతిట్టేవారు.

తనకు వచ్చిన ఈ అపఖ్యాతిని ఎలాగైనా పోగొట్టుకోవాలని లోభికి తోచింది. ఆయనవద్ద విశ్వాసపాత్రుడైన ఒక నౌకరు ఉన్నాడు; ఆయన వాడితో సంప్రతించి, ఏదైనా ఉపాయం ఆలోచించమన్నాడు.

"మీరు గొప్ప దాత అని లోకం చేత అనిపించటం సాధ్యం కాదు. కాని దాతగా పేరు తెచ్చుకున్న పొరుగూరి పెద్దమనిషిని సులువుగా మోసగించవచ్చు. ఆయనను ఒకనాడు మన ఇంటికి అతిథిగా పిలవండి. ఆయన మన ఇంట్లో ఉన్న సమయంలో నేను రకరకాల వేషాలు వేసుకుని అడుక్కోవటానికి వస్తాను. ఆయన చూస్తూ ఉండగా నాకు ప్రతిసారీ నూరేసి వరహాలు దానం ఇవ్వండి. ఆ దెబ్బతో ఆయన నిర్ఘాంతపోయి కనిపించినవారి కందరికీ మీ దాతృత్వం గురించి చెబుతాడు. కానీ ఖర్చు కాకుండా మీకు కూడా బోలెడంత కీర్తి వచ్చేస్తుంది," అని నౌకరు లోభికి సలహా చెప్పాడు.

"నీ ఆలోచన భేషుగ్గా ఉంది. ఆయనను భోజనానికి రమ్మందాం. ఈ సాయంకాలం నువు వారి గ్రామం వెళ్ళి, ఆయనకు ఎలా చెప్పాలో అలా చెప్పి, రేపు ఉదయమే మన ఇంటికి రమ్మను," అన్నాడు లోభి.



నౌకరు దాత ఉండే గ్రామానికి వెళ్ళి ఆయనతో, "అయ్యా, మా యజమాని గారు రేపు ఉదయానికల్లా తమరిని అతిథిగా వచ్చెయ్యమన్నారు," అని విన్నవించుకున్నాడు.

"మీ యజమాని పిల్లికి బిచ్చం పెట్టడని ప్రతీతిగదా, నన్ను రేపు అతిథిగా పిలవటంలో ఆయన ఉద్దేశం ఏమిటి? ఏమిటి విశేషం?" అని దాత లోభియొక్క నౌకరును అడిగాడు.

"అయ్యా, మా యజమానిని గురించి అందరూ అనుకునే మాటలను మీరు నమ్మినట్టున్నారు. అసలు సంగతి చెబుతాను వినండి. ఆయన చాలా గొప్పదాత. మామూలు బిచ్చగాళ్ళకు కూడా ఆయన నూరు వరహాలకు తక్కువ ఇవ్వడు. అయితే, ఆయన చేసేవి గుప్తదానాలు; మూడో కంటివాడికి తెలియవు. ఎందుకూ? రేపు మీరే చూస్తారుగా! ఇక మిమ్మల్ని భోజనానికి ఆహ్వానించటంలో విశేషమేమంటే ఇప్పటివరకూ ఆయన చేసిన దానాలతో లక్ష పూర్తి అయింది. అందుకని ఆయన రేపు గుడిలో అభిషేకం చేయిస్తున్నారు. ఆ సందర్భంలో ఒక తగిన మనిషికి భోజనం పెట్టాలని కూడా ఆయన నిశ్చయించారు. ఈ ప్రాంతాల ఆయనతో సరితూగ గల దాత మీరే గనక మిమ్మల్ని తప్పక రమ్మని చెప్పమన్నారు," అన్నాడు లోభి పంపిన నౌకరు.

దాత కొంచెంసేపు ఆలోచించి, "సరే, రేపు పెందలాడే వస్తున్నానని మీ యజమానితో చెప్పు," అన్నాడు.

నౌకరు లోభి వద్దకు తిరిగి వచ్చి, తాను చెప్పిన మాటలన్నీ ఆయనతో చెప్పాడు. మర్నాడు దాత లోభి యింటికి వచ్చాడు.

"తమరు వెంట నౌకరయినా లేకుండా వచ్చారేమిటి?" అన్నాడు లోభి.

"చిన్నపని ఉండి మా నౌకరు దిగబడిపోయాడు. ఆ పని పూర్తికాగానే వాడూ వస్తాడులెండి," అన్నాడు దాత.

"చూశారా? నేను ఇప్పటికి లక్ష వరహాలు దానం చేసి ఉన్నానన్న సంగతి మా నౌకరు మీకు చెప్పేశాడట. నా దానాలు గురించి ఇతరులకు తెలియటం నాకు సుతరామూ ఇష్టం లేదు సుమండీ. దాన ధర్మాలు చెయ్యటం ప్రధానం గాని, నాకు కీర్తి ప్రధానం కాదు. అందుచేత నా రహస్యం మీరు మరెక్కడా బయట పెట్టకండి!" అన్నాడు లోభి.

లోభి వద్ద ఉండే నౌకరు తన యజమానితో, "బాబూ, నేను గుడికి వెళ్ళి అభిషేకాలు చేయించి వస్తాను," అని బయలుదేరి ఇంటికి వెళ్ళిపోయాడు. తరవాత వాడు ఒక ముసలి బిచ్చగాడి వేషం వేసుకుని తన యజమాని ఇంటికే వచ్చాడు. దాతతో మాట్లాడుతూ ఉండిన లోభి తన పక్కన పెట్టుకుని ఉన్న సంచీలో నుంచి నూరు వరహాలు తీసి దానం చేశాడు.

ముసలి బిచ్చగాడు వెళ్ళిపోయిన కాస్సేపటికి ఒక బైరాగి వచ్చాడు. వాడికి కూడా లోభి సంచిలోనుంచి తీసి నూరు వరహాలిచ్చి పంపాడు.

అదిమొదలు భోజనాల వేళ అయే లోపల ఒక మూగవాడూ, ఒక గుడ్డివాడూ, ఒక దాసరీ, ఒక యాత్రికుడూ, ఒక బుడబుక్కలవాడూ, ఈ విధంగా పది మంది వచ్చారు. లోభి అందరికీ నూరేసి వరహాలు ఇవ్వటమేగాక, తన నౌకరు చాకచక్యంతో ఇన్ని వేషాలు మార్చి



రావటం చూసి మనసులో మెచ్చు కున్నాడు. దాత లోభితో, "మీవంటి దాతను నేను ఎక్కడా చూడలేదు, విన లేదు. ఈరోజే మీరు పదివేల వరహాలు ధర్మం చేసినట్టుంది!" అన్నాడు.

"లేదండీ, పదిమంది వచ్చారు, పది మార్లు దానం చేశాను. ఇది నాకు పరిపాటే లెండి," అన్నాడు లోభి.

మధ్యాన్నానికల్లా లోభి నౌకరు తన మామూలు వేషంలో వచ్చాడు. వాడు తన యజమానితో, "అయ్యా, లక్ష పత్రి పూజా, అభిషేకం ఇప్పుడే పూర్తి అయాయి. ఇదుగో ప్రసాదం తెచ్చాను," అని చెప్పి పళ్ళెంతో సహా ఇంట్లోకి వెళ్ళాడు.

కాస్సేపటికి లోభి కూడా లోపలికి వెళ్ళి నౌకరుతో, "నాటకం మాబాగా ఆడావు! ఏదీ మనసొమ్ము?" అన్నాడు.

"ఇదుగో చూసుకోండి! అయిదు వందలు!" అంటూ నౌకరు, లోభికి డబ్బుమూట ఇచ్చాడు.

"అయిదు వందలేమిటి? నేను నీకు వెయ్యి వరహాలిస్తినిగా?" అన్నాడు లోభి.

"లేదండీ, నేను అయిదుసార్లే వచ్చాను. మీరు నూరేసి ఇచ్చారు," అన్నాడు నౌకరు.

"మరి పదిమంది వచ్చారే! నువు అయిదుసార్లే వస్తే, మిగిలిన అయిదుసార్లూ వచ్చినవాళ్ళెవరూ?" అని లోభి ఆందోళనకొద్దీ గట్టిగా అడిగాడు.

"వాడు మా నౌకరు అయి ఉంటాడు లెండి," అని దాత గొంతు వినిపించింది.

యజమానీ, నౌకరూ లోపల మాట్లాడు కునే సమయంలో ఆయన చల్లగా లోపలికి వచ్చి, వాళ్ళ మధ్య జరిగిన సంభాషణ అంతా విన్నాడు.

"మా నౌకరు కూడా ఇక వచ్చేస్తాడు. వాడు కూడా మంచి నమ్మకస్తుడేలెండి. మీరిచ్చిన అయిదువందలూ ఎక్కడికీ పోవు!" అన్నాడు దాత.

లోభి ఆశ్చర్యావమానాలతో కుంగిపోయి ఏమీ అనలేక కొయ్యబారిపోయాడు.





# పిరికిపిశాచం

మునిపల్లెలో వుండే, నీలాంబరం దగ్గిర రెండు పాడిగేదె లుండేవి. వాటి పాలమ్మి అతను గుట్టుగా కాపురం చేసుకువస్తున్నాడు. అయితే, ఆ వర్షాకాలం ఏదో జబ్బుచేసి రెండు గేదెలూ ఒకే రోజున చచ్చిపోయాయి. నీలాంబరం కుప్పకూలిపోయాడు. వేరే ఆధారం లేక అతను, ఊళ్ళో దొరికినచోట్ల అప్పులు చేశాడు. క్రమంగా అప్పులవాళ్ళ బాధ ఎక్కువయింది.

ఒకనాటిరాత్రి, పిల్లలు నిద్రపోయాక నీలాంబరం, భార్యతో, "నేనీ రాత్రే, ఎవరికీ చెప్పకుండా పట్నం వెళ్ళిపోతాను. పెళ్ళినాటి ఉంగరం, మురుగులూ అమ్మి, ఏదైనా వ్యాపారం ప్రారంభించి, యీ ఊళ్ళో అప్పులు తీర్చగలిగిననాడే తిరిగి వస్తాను. నేను వచ్చేదాకా నువ్వు మెడలోని పుస్తెలు అమ్మి, ఏ ఇళ్ళల్లోనైనా పని చేసుకుంటూ పిల్లల్ని సాకు," అన్నాడు దిగులుగా.

అతని భార్య కనకం, కళ్ళనీళ్ళు పెట్టుకుని, "నువ్వు లేకుండా, యీ ఊళ్ళో క్షణంసేపు వుండలేను," అన్నది.

"అలా అనకు. పట్నంలో స్థిరపడే దాకా, మిమ్మల్ని యిక్కడ వుంచక తప్పదు," అన్నాడు నీలాంబరం దిగులుగా.

"వ్యాపారంలో లాభాలు వచ్చి, నువ్వక్కడ స్థిరపడగలవన్న నమ్మకం ఏమిటి? అనుభవం లేని నువ్వు, అన్నివిధాలా నష్టపోతే, ఏం చేస్తాం? నువ్వు వెళ్ళొద్దు," అన్నది కనకం.

ఈ మాటలకు నీలాంబరం విసుగ్గా, "ఇలా నాకు పిరికిమందు నూరిపోస్తావా?" అన్నాడు.

అంతలో, వీధితలుపు నెవరో మెల్లిగా తట్టిన శబ్దమయింది.

మాచిరాజు కామేశ్వరరావు

"ఎవరు ?" అంటూ వెళ్ళి, నీలాంబరం తలుపు తీశాడు.

గుమ్మంలో చేతులు కట్టుకుని నిలబడి వున్న, గూనిపిశాచాన్ని చూస్తూనే, నీలాంబరం నిలువెల్లా వణికిపోయాడు.

"జ్వరం మందు, దగ్గుమందు, తల నొప్పిమందుల్లా, ఈ పిరికిమందు, పిరికి తనం పోవడానికేనా ?" అని అడిగింది గూనిపిశాచం.

నీలాంబరానికి గొంతుపెగలడం లేదు. అక్కడికొచ్చిన కనకం ధైర్యంతెచ్చుకుని, "ఈ సంగతి కనుక్కోడానికి, అర్ధరాత్రి వచ్చి తలుపు తట్టాలా ?" అని అడిగింది.

గూనిపిశాచం చేతులు జోడించి, "అమ్మతల్లీ, నీకు పుణ్యం వస్తుంది. ఆ మందేదో నీ భర్తకు బదులు నాకు పోసి, నా పిరికితనం పోగొట్టు! నా బతుకంతా భయంతో గడిచిపోతున్నది. వల్లకాడు వదిలి ఊళ్ళోకి రావడం, యిదే మొదటి సారి. మిగతా పిశాచాలు వల్లకాడు పీకిపందిరేస్తాయి. ఊళ్ళ మీదపడి నానా గోలా చేస్తాయి. నాకు దీపాలుచూస్తే కళ్ళు బైర్లుకమ్ముతాయి. మనిషినిచూస్తే, ఒకే గుండెదడ !" అన్నది.

పిశాచం పిరికితనం సంగతి విని, కనకం మరింత ధైర్యం తెచ్చుకుని, వంట గదిలోకి వెళ్ళి, అంతా పరీక్షగా చూసింది. ఒకచోట ఆమెకు కొద్దిగా చింతపండూ, వాముపొడీ, ఉప్పూ కనిపించాయి. ఆ మూడూ కలిపి నీళ్ళుపోసి నూరి, ఒక



గరిటెలో వేసి తెచ్చి, "ఇదుగో పిరికి మందు! తాగు," అన్నది పిశాచంతో.

పిశాచం కళ్ళుమూసుకుని, ఆ మందు ఒక్కగుక్కలో తాగేసి, తర్వాత చీకట్లోకి చేయిచాపి, ఒక మూట తెప్పించి, కనకం చేతిలో పెట్టి, "నీ వైద్యానికి ప్రతిఫలం!" అన్నది.

కనకం గలగలలాడుతూన్న, ఆ మూట బరువును అంచనా వేస్తూ, వెళ్లిపోబోతున్న పిశాచంతో, "ఆగాగు! ఈ మందు మూడు రోజులపాటు పుచ్చుకోవలసి వుంటుంది. రేపు రావడం మరిచిపోయేవు!" అన్నది.

తర్వాత ఆమె దానికి, పిరికితనం ఎంత హీనమైనదో, ధైర్యంతో ఎన్ని ఘనకార్యాలు చేయవచ్చునో నూరి పోసింది. పిశాచం మరసటిరోజు వచ్చే విధంగా, దానికి ఎందరో సాహసవీరుల కథలు చెప్పి, ఉత్సాహపరిచింది.

తెల్లవారవస్తూండడంతో, పిశాచం నల్ల పిల్లిగా మారి, నక్కుతూ వల్లకాటికేసి పరుగుతీసింది. అది వెళ్ళిపోగానే భార్యాభర్తలు, ఆత్రంగా మూట విప్పి చూశారు. కళ్ళు మిరుమిట్లుగొల్పుతూ బంగారు కాసులు. వాళ్ళు పరమానందభరితులై పోయి, ఆ మూటను అటక మీద దాచారు.

మర్నాటిరాత్రి పిరికిపిశాచం వచ్చి, కనకంతో, "పిరికిమందు పొయ్యి!" అన్నది.

ఈ రోజు దాని గూని కొంత తగ్గినట్టు కనిపించింది. కనకం ముందే సిద్ధం చేసి





వుంచిన మందు దాని చేత తాగించి, ఆ రోజు కూడా ఎంతోమంది వీరులకథలు చెప్పి, పిశాచంచేత సంతోషంగా చప్పట్లు చరిపించింది.

పిశాచం మరొక మూటను చీకట్లో నుంచి తెప్పించి, కనకం చేతిలో పెట్టి, గుడ్లగూబగా మారి వల్లకాటికేసి ఎగిరి పోయింది. భార్యాభర్తలు, ఆ మూటను కూడా అటక మీద దాచారు.

నీలాంబరం, భార్యతో, "రేపు కూడా మరొక బంగారు కాసుల మూట సంపాయిస్తే, ఊళ్ళో అప్పులన్నీ తీర్చేసి, మనం హాయిగా పట్నం వెళ్ళవచ్చు. నీలాంటి తెలివిగల భార్య వుండగా, యిక వ్యాపారంలో నష్టపోతామనే భయమే లేదు!" అన్నాడు.

మూడో రోజు రాత్రి, పెద్ద కోలాహలంగా పిశాచం వచ్చి, పిరికిమందు గరిటెడు తాగేసింది. ఈరోజుదానిగూనిపూర్తిగాపోయింది.

"చూశావా, నీ గూని కూడా పిరికితనం వల్ల వచ్చిందే! నా మందు పని చేశాక, అది కూడా పోయింది," అన్నది కనకం.

తర్వాత ఆమె, దానికి ఏదో కథ చెప్పబోతూండగా, పిశాచం, "ఈ చచ్చుకబుర్లు వినే తీరిక నాకు లేదు. అవతల వల్లకాట్లో ఎంతో రచ్చచేయాల్సి వుంది," అన్నది పోబోతూ.

కనకం, దాన్ని ఆపుతూ, "ఈపూట మూట మాట మరిచావా?" అని అడిగింది.

ఆ మాటలకు పిశాచం కళ్ళెర్రచేసి, "నన్నే అడ్డగిస్తావా? ఎంత ధైర్యం నీకు!" అంటూ నాలుక పొడవుగా చాచి, అటక మీద భార్యాభర్తలు దాచిన రెండు మూటలూ మింగి, రాబందులా మారి, రెక్కలు తపతపలాడిస్తూ వల్లకాటికేసి ఎగిరిపోయింది.

ఇది చూసి నీలాంబరం, పెద్దగా కేక పెట్టి మూర్ఛపోయాడు. కనకం, అతడి ముఖాన చన్నీళ్ళు చిలకరిస్తూ—పిశాచానికి తానిచ్చిన మందులో విశేషం ఏమీ లేకపోయినా, దానికి మందు మీద వున్న

నమ్మకం, తాను చెప్పిన సాహసవీరుల కథలూ ఉత్తేజం కలిగించి, పిరికితనం పోయేలా చేశాయని గ్రహించింది.

ఈలోపల, నీలాంబరం కేక విని, యిరుగుపొరుగువాళ్లు అక్కడికి వచ్చారు. చాలాసేపు ఉపచారాలు చేశాక, నీలాంబరం కళ్ళు తెరిచి, "కనకం! పిశాచం నీ పిరికిమందు తాగి ఎంత ధైర్యం, గుండె బలం తెచ్చుకున్నది. అది మనకిచ్చిన డబ్బంతా, ఎత్తుకుపోయినట్టేగదా!" అన్నాడు.

వచ్చినవాళ్ళకు, నీలాంబరం మాటలేమీ అర్థం కాలేదు. వాళ్ళు కనకం ద్వారా జరిగినదంతా విని అమితాశ్చర్యం చెందారు.

పిరికిపిశాచానికి ఏదో మందు యిచ్చి, కనకం దాని పిరికితనం పోయేలా చేసిందని, తెల్లవారే సరికి ఊళ్ళో అందరికీ తెలిసిపోయింది.

మర్నాడు కనకం ఇంటిముందు ముగ్గు పెడుతూండగా, ఒక వృద్ధుడు, తన మనవడిని వెంటబెట్టుకువచ్చి, "చూడు. కనకం! నీ దగ్గిర పిరికితనం పోగొట్టే, మందేదో వుందని తెలిసింది. వీడు, నా మనవడు! పట్టి పిరికివెధవ. వీడికి ఆ మందిచ్చి సాయపడు," అంటూ కనకానికి పదిరూపాయలిచ్చాడు.

కనకానికి, కొందరు మనుషుల్లో వుండే పిరికిపిశాచాన్ని పారదోలే మందేదో అర్థమైంది. పిరికివాళ్ళను ఉత్సాహపరచడం, వాళ్ళల్లో ఆత్మవిశ్వాసాన్ని పెంచడం. ఆ పైన నమ్మకం కలిగించడానికి, తన వద్ద పిరికిమందు వుండనే వున్నది!

సంగతి తెలుసుకున్న నీలాంబరం, భార్యతో, "ఇదే బావున్నది! ఇక నుంచి పిరికివాళ్ళను ఉత్సాహ పరిచే ప్రయత్నంలో, నేనూ నీకు సాయపడతాను. ఇక మిమ్ములను ఈ ఊళ్ళో విడిచి పట్నం వెళ్ళే ప్రసక్తే లేదు." అన్నాడు చిన్నగా నవ్వుతూ.

ఆ మాటలు, కనకానికి ఎంతో ఆనందం కలిగించాయి.





# దొరికిన డబ్బు

రామాపురం అనే గ్రామంలో మాధవుడు, నారాయణ అనే వాళ్ళు, పక్కపక్క ఇళ్ళల్లో నివసిస్తూండేవాళ్ళు. ఇద్దరూ కొంత విద్య నేర్చినవాళ్ళయినా, ఎక్కడా ఉద్యోగాలు దొరక్క, గ్రామంలో దొరికిన పనులు చేస్తూ పొట్ట పోసుకునేవాళ్ళు.

నారాయణకు తను బీదవాడినన్న సంగతి ఎంతో బాధకలిగిస్తూండేది. తన కోపాన్ని భార్యాబిడ్డలను తిట్టడంలో చల్లార్చుకుంటూండేవాడు. మాధవుడు వున్నంతలో తృప్తిపడి, భార్యాబిడ్డలపట్ల ఎంతో ప్రేమగా వుండేవాడు.

ఒకసారి నారాయణ, మాధవుడితో, "మాధవా, మన బీదస్థితికి జాలిపడి ఏ దేవతో, నిధిలాంటిది కంటబడేలా చేస్తే ఎంత బావుండును!" అన్నాడు.

ఆ మాటలకు మాధవుడు నవ్వి, "మనిషికి తన స్వశక్తి మీద నమ్మకం లేనప్పుడే, ఉట్టినే లభించే నిధుల మీద ఆశ పెరుగుతుంది. నువ్వలాంటి లేనిపోని ఆశలకు పోకు," అన్నాడు.

ఒకసారి వాళ్ళిద్దరూ ఏదో పని మీద పట్నం బైలుదేరారు. దారిలో ఒకచోట నారాయణకు, ఒక సంచీ పడివుండటం కంటబడింది. వెంటనే అతను దాన్ని మాధవుడికి చూపుతూ వెళ్ళి తీసుకున్నాడు. అందులో నూరువరహాలున్నవి.

అంత డబ్బు ఒక్కసారి కళ్ళబడగానే, నారాయణ ఎంతో సంతోషంగా, "చూశావా, మాధవా! నేనన్నమాటల్ని తేలిగ్గా కొట్టిపారేశావు. ఇప్పుడు చూడు. ఏ దేవతో మనపట్ల జాలి తలిచి, యింత డబ్బు దొరికేలా చేసింది," అన్నాడు.

దానికి మాధవుడు, "మనల్ని చూసి జాలిపడ్డ దేవత, మరొకణ్ణి చూసి కోపగించుకున్నదంటావా? ఈ డబ్బు ఎవరో

"లలిత"

పోగొట్టుకున్నదేగాని, ఏ దేవతో ఆకాశం నుంచి జారవిడిచిందికాదు,'' అన్నాడు.

మాధవుడి మాటలకు, నారాయణ, "ఎలా అయితేనేం, డబ్బుదొరికింది. ఇద్దరం చెరిసగం పంచుకుందాం,'' అన్నాడు.

అందుకు మాధవుడు ఒప్పుకోక, ''ఈ సంచిని యిలాగే తీసుకుపోయి, మన గ్రామాధికారికి ఒప్పజెబుదాం. ఆయన డబ్బు పోగొట్టుకున్నవాడెవడో తెలుసుకుని యిచ్చేస్తాడు," అన్నాడు.

ఆ మాటలకు నారాయణ కోపంగా, ''మాధవా, నాకు నీతినియమాలు లేవని అనుకుంటే, అనుకో! కానీ, అదృష్టం కొద్దీ దొరికిన డబ్బును, నాకు దక్కకుండా చెయ్యకు. నువ్వు భాగం తీసుకోకపోతే, నాకు బాధ కలుగుతుంది,'' అన్నాడు.

మాధవుడు మాట్లాడకుండా, నారాయణ యిచ్చిన యాభైవరహాలూ తీసుకున్నాడు.

తర్వాత పట్నంలో నారాయణ, తనకూ, భార్యాపిల్లలకూ కొత్తబట్టలు కొన్నాడు. మాధవుడు మాత్రం, తనవంతు వచ్చిన యాభైవరహాలను అలాగే వుంచుకున్నాడు.

ఒక నెల రోజులు గడిచాక, మాధవుడు మాటల సందర్భంలో నారాయణతో, ''నారాయణా, నాకు పట్నంలోని ప్రభుత్వ కచేరీలో ఖజానాగుమాస్తా ఉద్యోగం వచ్చింది,'' అన్నాడు.



నారాయణ, ''పట్నంలో ఉద్యోగమా! ఎలాసంపాదించగలిగావు?"అనిఅడిగాడు.

''ఆ రోజు మనకు దారిలో దొరికిన డబ్బులో, సగం నాకు యిచ్చావు. ఆ మర్నాడు, ఆ యాభైవరహాలతోపాటు, నా భార్య దాచుకున్న పాతికవరహాలు కూడా తీసుకుని, మన గ్రామాధికారి రామన్నగారి దగ్గరకు వెళ్ళాను. ఆయనకు నేను తీసుకుపోయినడెబ్భైఐదు వరహాలూ యిచ్చి, జరిగినదంతా చెప్పాను,'' అన్నాడు మాధవుడు.

''అంటే, నేను తీసుకున్న యాభై వరహాల సంగతి, ఆయనకు తెలిసిపోయిందన్న మాట!'' అన్నాడు నారాయణ.

"తెలిసింది. అయినా, ఆయన నీమీద ఏమీ కోపగించుకోలేదు. ఆ డబ్బు పోగొట్టుకున్నవాడు, మనవూరి మల్లన్న. అతడికి పట్నంలో కూరగాయల వ్యాపారం వున్నది. రామన్నగారు నవ్వుతూ, మిగిలిన పాతికవరహాల మాటేమిటి? అని అడిగాడు. ఆ మొత్తం రెండు, మూడు నెలల్లో యివ్వగలనన్నాను," అన్నాడు మాధవుడు.

ఇది విన్న నారాయణ మరింతగా ఆశ్చర్యపోతూ, "అదిసరే, మరి నీకెలా యీ ఉద్యోగం వచ్చింది?" అని అడిగాడు.

"నిన్న రామన్నగారు, నాకు కబురు చేసి, 'మాధవా, నీ నిజాయితీ మెచ్చదగింది. నిన్న పట్నం వెళ్ళివచ్చాను. అక్కడి ఖజానాధికారి నాకు బాగా పరిచయస్థుడు. ఖజానాలో ఎప్పుడూ లక్షవరహాల ధనం నిల్వ వుంటుంది. ఆయనకు నమ్మకస్థుడైన గుమాస్తా కావాలి. నీ గురించి చెప్పాను. వచ్చి ఉద్యోగంలో చేరవలసిందిగా చెప్పమన్నాడు,' అని తెలియజేశాడు," అన్నాడు మాధవుడు.

నారాయణ దిగులుగా, "అయితే, నన్ను ఒంటరిగా యిక్కడ వదిలి పోతున్నావన్నమాట! దురాశాపరుడనైన నాకు, మంచి శిక్షేపడింది!" అన్నాడు.

మాధవుడు, అతడి భుజం తట్టి, "నారాయణా, దిగులుపడకు. నువ్వూ, నాతోపాటు పట్నం వస్తున్నావు. రామన్నగారూ, మల్లన్న కూడా నీ బీదతనం నీచేత చేయరానిపని చేయించిందన్నారు. మల్లన్న పట్నంలోని తన కూరగాయల వ్యాపారంలో, నీకు భాగమిస్తానంటున్నాడు. బహుశా, యీ రోజే అతడి నుంచి నీకు కబురు వస్తుంది," అని చెప్పాడు.

మాధవుడు చెప్పినట్టే, మల్లన్న అతడికి కబురుచేసి, జరిగినదాన్ని గురించి కలత పడవద్దని చెప్పి, తన వ్యాపారంలో భాగస్వామివి కమ్మన్నాడు. నారాయణ అందుకు సంతోషంగా అంగీకరించాడు.

వారం రోజుల తర్వాత మిత్రులిద్దరూ, తమ తమ కుటుంబాలతో ఆనందంగా పట్నంకేసి ప్రయాణించారు.



ప్రకృతి వింతలు :



## బింటురాంగ్

పురాతన సస్తన జంతువులలో ఎలుగుబంటి పిల్లి అని పిలువబడే బింటురాంగ్‌కు మాత్రమే–కొమ్మలను వడిసి పట్టుకోవడానికి వీలయ్యే తోక ఉన్నది.

## పిల్లి మీసాలు

పిల్లి జొరబడాలనుకునే కన్నాల వెడల్పు ఎంతో తెలుసుకోవడానికి పిల్లి మీసాలు ఉపయోగ పడతాయి. పిల్లి మీసాల పొడవు దాదాపు దాని శరీరం అడ్డుకొలత అంత వుంటుంది. మీసాలు,



ద్వారం అంచులకు తగిలాయంటే అది ప్రవేశించడానికి వీలు కానంత చిన్నదని పిల్లి గ్రహిస్తుంది.

## చాలా అపాయకరం!



వన్యమృగాల కన్నిటికీ కేప్‌బఫెలో అనబడే ఆఫ్రికా గేదె చాలా భయానకమైనదిగా భావించబడుతున్నది. ఇది సమ్మెటలా కాస్త కిందికి వున్న తలతో గంటకు 60 కి.మీ. వేగంతో కుమ్మగలదు. 1.5 మీటర్లు ఎత్తుగల ఈ జంతువు ఒకటన్ను బరువుంటుంది. 1.4 మీటర్లు విస్తరించుకున్న బలమైన కొమ్ములు గల ఈ భయంకర జంతువులను చూసి సింహాలు కూడా దారి ఇస్తాయి.

# మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచీ మీ పాపాయికి, పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి. సెరిలాక్ లాభాన్ని అందించండి.

పోషకాహార లాభం : సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు, ప్రొటీన్లు, కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజాలూ అన్నీ వున్నాయి. అన్నీ సమ పాళల్లో వున్నాయి.

రుచి లాభం : పాపాయిలకు సెరిలాక్ రుచి ఇష్టం.

సమయం ఆదా లాభం : సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ, పంచదార వున్నాయి. దానిని వెచ్చటి నీటితో కలిపితే చాలు.

ఎంపిక లాభం : ఎంచుకునేందుకు మూడు రకాల సెరిలాక్ వుంది.

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకూ, తయారుచేయటంలో పరిశుభ్రతను పాటించేందుకూ, డబ్బా మీది సూచనలను జాగ్రత్తగా పాటించండి.




6 మాసాలు నించీ




4 మాసాలు నించీ




6 మాసాలు నించీ

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి: సెరిలాక్
పోస్ట్ బాక్స్ నెం 3
న్యూ ఢిల్లీ 110008




**సెరిలాక్ రక్షణ: పోషకాహారంతో పరిపూర్ణం-ఎంతో రుచికరం**

RK SWAMY/FSL/5112/TEL

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1989 సెప్టెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



V. Muthuraman

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ జూలై నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/-లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:- చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: ఎక్కాలోయ్ ప్రగతిమెట్లు! రెండవ ఫోటో: ఎదురు చూస్తున్నాయ్ ఖాళీసీట్లు!!

పంపినవారు: పి. వి. నరసింహదాసు, విజయనగరం—202 (ఆం. ప్ర.)

బహుమతి మొత్తం రు. 50/- నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 36-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.


---

# Pick a PINKY...

## and let your writing sparkle...

PINKY

LION

# PINKY

*the Prettiest Pencil in town.*

Now from Lion Pencils, here's another Novelty...
the Pearl finished **LION PINKY** pencil, a pretty pencil to behold.
Superb in looks, super smooth in writing with its HB Lead
strongly bonded to give you unbreakable points.

***Also available with rubber tip and hexagonal***

***Other popular brands of Lion Pencils are:***

Lion **MOTO,** Lion **TURBO,** Lion **SWEETY,** Lion **CONCORD,**
Lion Hi-Tech **METALLIC,** Lion **MASH-HOOR,** Lion **EXECUTIVE,**
Lion **NOVELTY,** Lion **GEEMATIC** Drawing Pencils
and **RATTAN** Colour Pencils & Wax Crayons.



**LION PENCILS PVT. LTD.** 95 Parijat, Marine Drive, Bombay 400 002.

National-407

